తాతాజీ రచనలు

# పాత పాళీ

(ఖండకావ్య సంపుటి 1)

కృష్ణాజిల్లా పెనమలూరు గ్రామస్థులు
చిగురుపాటి బుచ్చిరామయ్య గారి
డా॥ చంద్రశేఖర్ గారు
బహూకరించిన పుస్తకం

తాపీ ధర్మారావు.

# చిన్న మనవి

ఖండకావ్య రచనలో నాకు, మంచిదో చెడ్డదో, ఒక పద్ధతి ఉంది. తీరికగా కూర్చొని దేనిమీద వ్రాస్తే బాగుంటుందని విషయం ఎంచుకొని, వ్రాయడం నా కలవడలేదు. ఏదో సన్నివేశమో, సంఘటనో, అనుభవ విశేషమో. గట్టిగా ఊహలను కదిలించాలి అప్పుడుగాని కావ్యరచనకు వేడికలగదు అటువంటి సందర్భాలలో వ్రాసినవే యీ ఖండికలు.

మరొక్క సంగతేమిటంటే, ఆ రచన తరువాత, దాని నే పత్రికలోనో ప్రచురించడముతో దాని సంగతే మరచిపోవడము జరిగేది. ప్రతులను భద్రపర్చాలని గాని, ఎప్పుడయినా వాటిని సంకలన చేసి పుస్తక రూపంగా ప్రకటించాలని గాని, ఉండేదికాదు. మిత్రుల ప్రోత్సాహముతో ఇప్పుడు వాటిని పుస్తక రూపంగా ప్రకటించాలన్న అభిప్రాయం కలిగింది.

ఈ ఖండ కావ్యాలు ఒక్క పత్రికలో కాక, ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలలోనూ, భారతీ పత్రికలలోనూ, సమదర్శని ఉగాది సంచికలలోనూ, జనవాణి, కాగడ పత్రికల లోనూ, గ్రంథాలయ సర్వస్వ సంచికలలోను ఇంక నెన్నో పత్రికలలోనూ ప్రచురణలు జరిగాయి. కాబట్టి, సంకలన సులభమయిన పని కాదు. మిత్రుల తోడ్పాటుతో, ఏలాగయితేనేమి, కొన్నిటి ప్రతులను సంపాదించగలిగినాను, వాటిలో కొన్నిటిని (12 ఖండాలను) ఈ రూపంగా నివేదించుకుంటున్నాను, ఆయా పత్రికా సంపాదకుల కందరికీ నా కృతజ్ఞత.

స్వవిషయాలకు సంబంధించిన మరికొన్ని ఖండకావ్యాలను త్వరలోనే మరొక సంపుటముగా ఆంధ్ర మహాజనులకు అందజేసుకుంటాను.

ఆయా ఖండకావ్యాల అవతారకలలో నన్ను రచనకు ప్రేరేపించిన సన్నివేశమేమిటో, ఆ విషయం ప్రకటించడానికి నేను అనుకున్న విధానమేమిటో పాఠకులకు నివేదించుకున్నాను. ఆ సంగతులు తెలిసుంటే ఆ ఖండిక సుబోధం కాగలదని నా ఆశ. అప్పుడే నా నిర్వహణలోని లోపాలోపాలు విశదమవుతాయని నా ఊహ. ఆ యూహతోనే ఈ అవతారికలు వ్రాసే పద్ధతి అవలంబించాను. సహృదయులు మన్నిస్తారని నమ్ముతాను.

ఈ ఖండకావ్యాలలో కొన్నిటియందున్న విషయాలు నేనే ఈనాడు అంగీకరించ నన్నప్పుడు, పాఠకులందరు వాటిని హర్షిస్తారని ఏలాగ అనుకోగలుగుతాను? వాటికి విముఖులు చాలమంది ఉంటారని నే నెరుగుదును. అటువంటి వారికి నేనొక్క మనవి చేస్తాను. "దయచేసి విషయాన్ని విడిచిపెట్టి, విధానానికే ప్రాధాన్యమిచ్చి చదవండి" అని.

"అచ్చుతప్పులుండకపోతే ఆంధ్రముద్రణమే కాదు" అనదగిన ఈ రోజులలో గ్రంథంలో అచ్చుతప్పులుండకపోవని వేరుగా చెప్ప నవసరములేదు. వాటిని పాఠక మహాశయులు క్షమిస్తారని నమ్ముతాను. అలా క్షమించరాని మహాఘోరమయిన తప్పు ఏదయినా ఉంటే, సహృదయులు తెలియపర్చవలసిందని కోర్తాను. పునర్ముద్రణలో (అటువంటి అవకాశమే ఉన్నట్టయితే) సవరించుకుంటాను.

హైదరాబాదు.
అక్టోబరు, 1960.

తాపీ ధర్మారావు.

## విషయసూచిక

# గ్రాంథికభాషా వాదము.

## (భాషా విషయ రచన)

యాభయి సంవత్సరాలనాటి మాట. అప్పుడే శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు గ్రాంథికభాషమీద ధ్వజమెత్తారు. వారివాదనను ప్రతిఘటించాలి. మూడేళ్లకు ముందు నేను పర్లాకిమిడి కాలేజీలో వారి శిష్యుడను. వారిజ్ఞానము, దీక్ష, వాదనపటిమ బాగా ఎరుగుదును. నాకా! గ్రాంథికభాషాభిమాన బలము తప్ప వేరు సాయము లేదు. జంకు కలగక తప్పదు కదా! కాబట్టి, శ్రోతల ఆదరణ నార్జించుకోడానికి ఒక ఉపాయముగా, చిన్న కల్పనతో, పద్యరూపమున నా వాదనోపన్యాసాన్ని ప్రకటించాను.

అదే ఈ చంపకమాలిక. ఆ రోజులలో చాలామంది మాలికలు వ్రాస్తూ ఉండేవారు. నా చంపకమాలికకు ప్రత్యుత్తరమా అన్నట్లు, ఆ తరువాత శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము మేష్టరుగారు ఒక శార్దూలమాలిక ప్రకటించి గ్రాంథిక వాదాన్ని ఖండించారు లెండి.

దీనిలో ఇంకొక విశేష ముంది. ఈ కల్పనలోని "తెలుంగనెడు కాంత" కథ చాలమంది పండితుల అభిమానాన్ని సంపాదించుకుంది. ఆ ప్రోత్సాహముతోనే నేను ఆకాంతకు 'కలభాషిణి' అన్న పేరు (తెలుగు ది ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ కదా!) పెట్టి, ఆమె స్వీయచరిత్ర రూపంగా ఆంధ్రభాషా చరిత్రను, శ్రీ వీరేశలింగం పంతులుగారి వరకు, వ్రాశాను. "ఉషఃకాలము" అన్న పేరుతో దానిని, మే మప్పుడే బరంపురములో స్థాపించిన, "వేగుఁజుక్క" గ్రంథమాలలో ప్రథమగ్రంథముగా 1911లో ప్రచురించాము. ఆ గ్రంథానికి తిరుపతి వేంకటకవులు చెప్పినట్లు "కంఠమాలిక"గా ఈ చంపకమాలను దానిలో ప్రకటించాను.

కవులూ భాషావేత్తలూ అయిన శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు ఆ "ఉషఃకాలము" గురించి ఇలా వ్రాశారు :

కలభాషిణి యనుపేరున
నల యాంధ్రకవిత్వకాంత ఆత్మచరిత్రం
బలఘు ప్రక్రియ తన కొమ
రులకుం దెలియంగ జేసె ప్రోన్నత కరుణన్.

నవలారూపముగా, మనోహరముగా, నానారసోల్లాసి గా
నవలావణ్య యుతంబుగా నెసగ నాంధ్రం బందు సంస్తూయమా
న వచః ప్రౌఢిమ జేయగాబడిన గ్రంథం బిదియే యంచు మా
నవనాథుల్ కవినాథులుం దెలిపి రానందంబు సూచింపుచున్.

మరి ఇరవైయేళ్ల తరువాత భాషను గురించి నా అభిప్రాయాలు మారాయి, భాషాభ్యుదయానికీ, ప్రజలవిజ్ఞానాభివృద్ధికీ, రచనలు వ్యావహారికములో ఉండాలన్న దృఢ విశ్వాసం కలిగింది. కవులకూ ప్రజలకూ మధ్యను పెరిగిపోయిన కొండలూ అడవులూ పోవాలన్నా, రచనలు ఈభాష నే సాగాలన్న నమ్మకం కుదిరింది. ఆ నమ్మకాన్నే "కొత్తపాళీ" గ్రంథ రూపంగా 1956లో ఆంధ్రమహాజనులకు అందజేసు కున్నాను. ఆభాషతోనే దిన పత్రికను, వారపత్రికలను నిర్వహించాను. సినీమాలలో – పౌరాణిక చిత్రాలలోగూడ – వ్యావహారిక భాష నేలందరూ అంగీకరించినట్టుగానే ఉపయోగించాను. ఈనాడు ఎవ్వరో అత్యల్ప సంఖ్యాకులు తప్ప, తక్కిన రచయిత లందరు వ్యావహారికాన్నే గ్రంథాలూ వ్యాసాలూ వ్రాస్తున్నారు. ఈ భాషకు వ్యాకరణాలు వస్తున్నాయి; రేపో మాపో విశ్వ విద్యాలయాల వారుగూడా ఈ భాషను అంగీకరించక తప్పదు.

అందుచేత ఈనాడు ఈ "చంపకమాల"లోని విషయము (వస్తువు) నిరుపయోగ మయిం దనే చెప్పాలి. అయినా, దీనిలోని భాష, శైలి, భావ ప్రకటన, కల్పన పద్ధతి, వాదన విధానము, మొదలైన విషయాలు సహృదయులు చూడవచ్చునుగదా అన్న ఊహతోనే ఈ చంపకమాలికను పాఠకులకు నివేదిస్తున్నాను.

# చంపకమాలిక

పలువురు మెచ్చఁగా వివిధ
　　భాషల నేర్చిన యాంధ్రులార, యం
జలి నొనరించి వ్రాసెదను
　　శాంతి నొకింత యొసంగరే దయన్.
కలదుగదా, తెలుం గనెడి
　　కాంత యొకర్తు త్రిలింగ మందు, నీ
లలన కథన్ వినంగఁ గను
　　లన్ జలముబ్బును, మేనిరక్తమా,
చలనము మానఁబూను, మన
　　సా, యనుకంపను జెంది పెక్కు బా
ధలఁ గను; నేల యన్నఁ దొలు
　　తన్ తన చిన్నతనంబునందె, మా
టల మధురంబుగా నుడువు
　　టం గనునంతకు ముందె, యక్కటా!
పొలఁతి కనేక గండములు
　　మూడె; నవన్నియుఁ బాఱఁదోలి ధీ

లలితుఁడు నన్నపార్యుఁడు వె
లందినిఁ గాచి, యనేక భావరీ
తుల నెఱిఁగించి, సంస్కృతము
తో మిళితంబుగఁ బల్కనిచ్చి, భూ
తలపతి కొప్పగించి చనె
ధాత విధించిన రీతిగాఁగ; నా
వల, మన తిక్క నాది కవి
వర్యు లనేకులు ముద్దుమాటలన్
దెలుపఁగ నేర్చి, బాలిక గ
తి న్నుతి కెక్కుచు, నల్లసాని వా
క్కులఁ గల చిత్రవస్తువుల
గుంభనలం గని, ప్రౌఢరీతి, రా
యల వరియించి, మ్లేచ్ఛకుల
మ న్విపినంబును గాల్చి, సంపదన్
కులుకుచు, దిక్కులెల్లఁ దన
కుం బొలిమేరలుగాఁగ నిల్చి, శో
భిలె; నయిన న్సుఖంబు కడు
వేగము పోవును గాదె ధాత్రిలో
పల! నటు, రాయ లేఁగిరి ది
వంబునకుం, దదనంతరంబు కో

మలి పడుపాటు లెన్న మన
మా, మనధాతయుఁ జాలఁడే కదా!
ఖలులు తురష్కు లొక్కమొగి
గాఁ దనదేహముఁ గాల్ప నెంచి, బా
ముల నిడి రూపుమాపఁ దల
పోసిరి; చేసిరి ఘోరకృత్యముల్;
తలపడినారు, రాజ్యముల
ధ్వంసము జేసిరి, గ్రంథముల్ దవా
నలమునఁ ద్రోసినార; లిఁక
నాగతి యేమగునో యటంచు, బె
గ్గిలి, యొకమూల డాఁగి, కడుఁ
గ్రించుఁదనంబున నున్న యింతి నాం
గలవిభు లత్యుదారతను
గాంచి తలంచి, తలోదరీ, భయం
బలమఁగనీకు, నీ కభయ
హస్తము నిచ్చితి, మింక స్వేచ్ఛగా
నిల కల యన్నినాళ్ళు మను
మీ, చనుమీ ఘనమార్గ మందు నే
కలకల మందకుండ నని
కాచిరి...పిమ్మట నీ మెలంతకున్

చెలియలు కర్ణచారి తన
సేమము నారయ ముద్దురూపుతోఁ,
నలరెడు కీర్తితోఁ, గలిమి
నాకస మంటుచు, వచ్చి విన్ననై,
వెలవెలఁబోయి, యట్టె పృథి
విం గనుచుండెడి తన్విఁ జూచి, చిం
తిలి, యిదియేమి నేఁడకట !
దీని చరిత్రము చోద్యమాయె, నీ
కలవర మేమి హేతువునఁ
గల్గెనొకో యని చేరి, "యక్కరో,
కలకల మేటి కమ్మ ? మముఁ
గాంచి వచింప విదేల కొమ్మ ? నీ
చిలుకల బోని పల్కు లెటుఁ
జేర్చితి వమ్మ ? విభూష లేవి ? సం
స్ఖలనములేని మందగతి
కానఁగ రా దిదియేమి కొమ్మ ? నీ
చెలువము శయ్యయు న్విడిచి
చేడ్పడియుంటి విదేల యమ్మ ?" యం
చలికచ పల్కు, వెక్కి, యక
టా ! యని, హా ! యని, "యేమి చేయుదున్,

తొలుతటి బాధ పోయెనని
　　తోఁచెఁ, దురుష్కుల బాధ తగ్గె నం
చలరితిఁ; గాని, చెల్లి, విప
　　దంబుధిఁ ద్రోయఁ గడంగి, నాదు పు
త్రులె యకటా! ప్రతిజ్ఞఁగొని
　　రూపును మాపుచు నున్నవారు, నా
కిల నిఁక దిక్కులేదు గద
　　చే? వలవంతను మాను టెట్లు? లే
వలన సుఖంబు గాంచెద? న
　　పారముగాఁ గనుపట్టు దుఃఖమే
నలుగడ, రూపు పోయెను, ఘ
　　నంబగు వృత్తులు మాయమాయె, భూ
షలు కఱవాయె, శయ్య లోక
　　సారిగ మింటికిఁ బాఱిపోయె, సూ
నులు ననుఁ బిల్వరాయె, నిఁక
　　నూయియొ గోయియొ చూచుకొందు; నన్
దలఁపకు చెల్లి, యంచుఁ గను
　　దమ్ములఁ గార్చెను బాష్పధారలన్.

*　*　*

నలినదళాక్షి పల్కు విని
　　నారలుగా? యిఁకనైన మీర లో

పలువురు మెచ్చఁగా వివిధ
భాషలనేర్చిన యాంధ్రులార, యీ
తెలుఁగును గావఁబూనుఁ, డల
తెంపరి రీతిఁ జరించి గ్రామ్యమున్
గలుపఁగఁబోకుఁ, డిట్టులనఁగా
మది కోపముఁ జెందు నేమొ, న
న్నెలమి క్షమింప వేఁడెద ని
దే మిము నందఱఁ, గాని, చూడుఁ డాం
గలజన భాషయం దయినఁ
గాక మరే పరదేశ భాష లో
పల నయినన్. కవీశ్వరుల
భాషకు, వాడుకనుండు భాషకున్
గలదొక తారతమ్య, మిది
గాంచుఁడు; షేక్స్పియ రాలితోడుతఁ
బలికిన మాట లౌనె తన
వ్రాసిన హేమ్లెటులోని వాక్యముల్ ?
ఇల కలకాల ముండ లిఖి
యించిన మిల్టను వర్డ్సువర్తు ము
ఖ్యులు తమయిండ్ల పత్రముల
నున్న విధంబునఁ బల్కినారలే ?
సలిపెనె భాషణంబు లెని

సన్దొర వ్రాసినయట్లు? నెంతయో
గులుకుచు పర్గటోరియను
గూర్చిన పల్కుల డాంటి పల్కెనే?
కల యగు నిట్టి యూహ,
లటు గ్రామ్యమున న్లిఖయించిరేని, రా
వలసిన పాట్ల నెన్నుటకు
బ్రహ్మయుఁజాలఁ, డదేమ నందురా?
స్థలమున కొక్క గ్రామ్యమయి,
తా నతి చంచలయౌటఁ, గృష్ణలో
పల రచియించు పొత్తములు
వట్టి యనర్థము లౌను మాకు; మా
వలనఁ గవు ల్రచించునవి
వారలకేని విశాఖవారికేన్
దెలియుట కష్టసాధ్యమగు;
దేశమునందలి బుద్ధియెల్ల లో
భులకడ నున్న సొమ్ము గతిఁ
బొందు వినాశము; నింతెకాదు, రాఁ
గల మరి నాలుగబ్దముల
గ్రామ్యమునందు ననేకమార్పులుం
గలుగును, హూణభాష యధి
కంబుగఁ జొచ్చును, నప్పు డక్కటా!
తెలుఁగుల పెన్నిధాన మనఁ

దేజము గాంచిన గ్రంథరాజిలో
పల మణియైన భారతము
భార తమంబయి, హరాణ భాస ర
ట్టులఁ బని యేమి లేని యెవఁ
డో యొకవాని కరంబు వట్టు. ధీ
రుల రగు మీరు యోజనల
రోయుఁడు; దీనను మంచి చెడ్డలం
గలయఁగఁ జూడుఁ; డింకఁ, గల
కాలము నుండెడి పుస్తకాళిలోఁ
గలుగవలె న్నటుత్వమును,
గాలము నోర్చెడి బల్మికల్మియున్,
స్థలమును దూలనాడఁ గల
దార్ఢ్యము గావలెఁ; గాన, గ్రామ్యమున్
గలుపఁగఁ బోకుఁ డీగతిని
కట్టిడిమార్పులఁ జేరనీకుఁడీ.
చెలఁగి తెలుంగు సంస్కరణ
సేయఁగఁ బూనితిరేని, పెక్కుభం
గులు గల, వందు భావములఁ
గ్రొత్తలు సేయుఁడు; శైలిమార్పుఁడీ;
పలుగతుల న్మహాప్రకృతి

వర్ణనసేయుఁడీ; యంశ నైజముల్
మిళితముచేయఁ బూనుఁడీ; ర
మింపఁగఁజేయుఁడీ కెట్టులైనఁ గా
ని, లయముజెంద గ్రామ్య మను
నిక్కపు పాదరసంబు గూర్చి వ
న్నెల కనకంబు మా తెలుఁగు
నీరస మౌనటు జేయకుండ, మ
మ్మలరఁగఁజేసి, మీరు సుఖ
మందుచు నుండుఁ డటంచుఁ గోరి, దో
సిలి నొనరించి మ్రొక్కెదను
చేకొనుఁ డార్యులు,

ధర్మరాయఁడన్



# అక్షరశారదా ప్రశంస

## (పరిశోధనాత్మక రచన)

అది 1926; తమిళదేశ దక్షిణభాగములోని తిరునెల్వేలి జిల్లా అంబా సముద్రము దగ్గరి ఊర్కాడు సంస్థానము, దేవీ నవరాత్రుల ఉత్సవాలూ, ఉపన్యాసాలూ, పండితగోష్ఠులూ జరుపుతూ శృంగేరీ శారదాపీఠాధిపతులు శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ శంకరాచార్యులవారు నన్ను "ఆంధ్ర విశారదా" అని సంబోధించి, శారదాంబికకు నీపయి కరుణ కలిగింది, ఇంకా పూజచేసి ఇతోధికమయిన కీర్తిని ఆర్జించు అని పండిత శాలువులతో అనుగ్రహించారు. (ఆశాలువతోనున్న ఫోటోయే దీనిలోనిది.)

అంతకు పూర్వము నేనుచేసిన సరస్వతీపూజ(కవన రీతిని) ఏదీ లేదు. కాబట్టి,ఇప్పుడు జగద్గురువువారి ఆదేశము ప్రకారము ఏమి పూజచేయడము అని ఆలోచించ వలసి వచ్చింది. ఆ రోజులలో నేను పురాతన నాగరకతల పరిశోధన కొంత చేస్తూ ఉండేవాడను. అక్షరముల ఆకారము, ఉచ్చారణ, వాటి పుట్టు పూర్వోత్తరముల (evolution of the alphabets) గురించి కొంత విషయము సంగ్రహించి "ఓనమాలు" అన్న పేరుతో కొంత గ్రంథము వ్రాసి ఉంచాను, శ్రీ శంకరాచార్యులవారి ఆజ్ఞవమ్ము కాకుండా, ఆ విషయమునే సూక్ష్మంగా సూచిస్తూ "అక్షరశారదా ప్రశంస" అని ఈ ఖండ కావ్యము వ్రాసి, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటించాను.

విషయము పరిశోధనకు సంబంధించినది. ఈజిప్టులోనూ చీనాలోనూ ఉండిన బొమ్మలలిపి మొదలుకొని మన కీనాడున్న సుందరాక్షరముల వరకూ జరిగిన పరిణామము ఎంతో వివరణతో వ్రాయవలసినదే గాని, పద్య

రూపమున చెప్పవలసినది కాదని నే నెరుగుదును. అటువంటి విషయాన్ని తీసుకొని సరస్వతీ స్తోత్రముగ వ్రాయుట కష్టమనిగూడ తెలుసును. అయినా, ప్రయత్నము మానలేదు. ఇంత కంటే గడ్డుగా ఉండే శాస్త్రవిషయాలు మనవారు పద్యరూపములో ప్రకటించలేదా అని సాహసించాను. సుగమంగా ఉండని సంగతులను గురించి "అధోజ్ఞాపికల" foot notes లో కొంత తెలియపరుచు కున్నాను.

దానిలో లిపి, అక్షరము, వర్ణము, లేఖనము, కలము, పుస్తకము మొదలైన పదముల వ్యుత్పత్తిని గురించి కొంత చెప్పాను. అది మనవారి భారతీయాభిమానానికి వెగటుగా కనబడవచ్చును. పరిశోధకుని దృష్టికి అభిమానాలు అడ్డురాకూడదు కదా! నిన్న మొన్నటి వరకు మన భారతీయ లిపులు కొకిబికి రూపాలతో, ఎన్నెన్నో లోపాలతో, మార్పుచెందుతూ వస్తూండడం శిలాశాసనాలలో చూస్తూనే ఉన్నాము, అయినా, ఆదికిముందే మనవారు అన్ని అక్షరాలను సృష్టించి, ఉచ్చారణ స్థానాన్ని పట్టి క చ ట త ప వర్గములుగా విభజించినా రని ఆనందించడం అర్థంలేని విషయ మనక తప్పదు గదా!

ఈ రూపంగా లిపిని గురించి నా అభిప్రాయాలను ప్రకటించాను కదా అన్న తృప్తితో నా "ఓనమాల" రచన మూలపడి పోయింది. ముప్ఫయి యేళ్ల తరువాత, ఈవిషయము నే శ్రీతిరుమల రామచంద్రాచారి గారు తీసుకొని, విశేష పరిశోధనచేసి, "లిపి దాని పుట్టుపూర్వోత్తరాలు" అన్న ఉద్గ్రంథాన్ని రచించి, ఆంధ్రభాషకు అమూల్యమయిన ఆభరణాన్ని అందించారు. ఈ విషయం పాఠకులకు తెలిసే ఉంటుంది. ఇంకను ఈ విషయమున పరిశోధనలకు అవకాశము లున్నాయి. ప్రతి దినము క్రొత్త సంగతులు బయటపడుతున్నాయి. సత్యము త్వరలోనే వెల్లడి కాగలదని ఆశిస్తున్నాను.

# అక్షరశారదా ప్రశంస

శృంగపు రాధినాథుఁడు ప్ర
సిద్ధ జగద్గురు శంకరుండు[1] న
న్నుం గని "శారదాంబిక క
నూన కటాక్షము గల్గె; నింకఁ బూ
జం గను ముత్తమోత్తమ య
శంబుల నాంధ్రవిశారదా "యటం
చుం గరుణాతిరేకముసఁ
జూపఁలు లెన్న బహూకరించినన్.

శారదా పీఠపతి యాజ్ఞ జాదులునుఁ బ్ర
సాదమని, వెండి, సత్పాద స్తవము; నిట్టి
పూజఁ బునరుక్తిదోషంబు[2] పొసఁగ దనుచు
నక్షర కలాప, శ్రీ శారదా సురూప.

అత్యంతముఁ జూచినచో
సత్యం బెందైన నెఱుఁగఁ జాలము; నిన్నున్
ప్రత్యహము వాడెద మా
కృత్యాదులఁగూర్చి తెలియకే యక్షరమా.

---

1. శృంగేరీ శ్రీ శంకరాచార్యులవారు జగద్గురు శ్రీ మచ్చంద్రశేఖర భారతీ స్వామిగారు.
2. అర్థాంతరమున నిట్టివర్తన నింతకు మునుపెవరును చేసియుండరు. original అని.

ఆకారంబు నెఱుఁగఁజూడ ద్వివిధం
బై[3] తోఁచె దోశారదా,
నాకందోయికి నేఁడు; నందొకటి 'వీ
ణాపాణి' - వాగర్థ స

క్తాకారం బగు శబ్దరూపమును, న
న్యం, బారవంబై వినన్
రాకే, 'పుస్తకపాణి' - యక్షర సువ
ర్ణంబున్ విచిత్రా కృతిన్.

అది తొలిరూపమో, నిజమె
యక్షర శారద, సృష్టి కాదినిన్
మెదలిన మానస్పండు ధ్వని
నే యెఱిఁగెన్, శ్రవణంబె జ్ఞాన సం
పదకు పథంబుగాఁ జనె, స
మస్తము శబ్దమె; నాదమూర్తివై
మొదట నెఱుఁగఁగాఁబడుట
పోలును గాదె, వివాద మేటికిన్ ?

ఆశబ్దవికారంబే
ప్రాశస్త్యము నందె వేదభాజనమై వా
క్కోశంబుల ; త్వల్లిపి సం
కాశంబగు రూప మవలఁ గాదే పుట్టెన్ ?

3. శారద "వీణా పుస్తక పాణి" యనుట శబ్ద-అక్షర రూపములకు సూచన.

అవలఁ బుట్టి తనినయంతఁ, జిన్నతనంబు
గలుగ; దందు[4] లోపములను[4] దీర్చి
జ్ఞాన మిలను వెలయఁగా దోహదముఁ గూర్ప
నవతరించు శారదాంబ, నీకు.

వక్తృశ్రోతల లోకే యెడం గలియు నా
వశ్యంబునున్, శేముషీ
యుక్త స్ఫూర్తికిఁ దత్ప్రచారమునఁ గా
లోదగ్ర విచ్ఛిత్తి, యా
శ్లోకంబుల్ బహుజిహ్వాలం గను నస
త్యోద్రేకమున్ మాన్ప ను
ద్యుక్తంబై లిపిరూప మొందు కృప నీ
కొప్పారదా శారదా?

అవివే కాంధ తమిస్ర భేదన చణో
ద్య ద్దీప జాలంబొ, మా
నవ పూర్వార్జిత పుణ్య భూరుహ లతాం
త శ్రేణియో, సర్వకా
ల విపశ్చిజ్జన శేముషీ ధన ఘట
వ్రాతంబొ నాన్ శారదా,
యవతారం బొనరించి తక్షరగణ
ఖ్యాత స్ఫుర ద్రూపవై.

---

4. శబ్దరూపంబుగనే యుండిన యెడల గలుగు త్రివిధలోపములును తరువాతి పద్యమున జూడనగును.

తాంత్రిక పద్ధతిన్ బహు వి
ధంబుల[5] నుద్భవమొంది, లెక్కతో[6]
మంత్ర సమాఖ్య దివ్యనుహి
మం గని, దిగ్దళకంబుచేత నా
మంత్రణ మంది, నీ కనిన
మంగళరూప బహుత్వ మందులన్
సంత్రప[7] లేక, యేకతఁ[8] గ
నం జనుఁ గాదె విశిష్టబుద్ధికిన్.

తొలుతన్ రూపపు నామమై, పిదపఁ ద
త్పూర్వోక్త భాగంబులై,
తొలి శబ్దం బయి దాన, నావెనుకఁ ద
ద్వ్యోతాచ్ఛ వర్ణంబులై,
పలు చిహ్నంబులఁ దీఱు నంది, జగతిన్
వ్యాపించి, జ్ఞానోదయో

5. మతమునందలి తాంత్రికమును, వ్యవహారము నందలిదియు.

6. పంచాక్షరి, అష్టాక్షరి మొదలగునవి.

7. మనది యనుకొనుచుండిన యీ లిపి వేఱొక్కరి వలన గలిగెనవి యొప్పికొనుటకు దురభిమానము పొందెడి సిగ్గు.

8. బహుత్వమున నేకత్వము (Unity in Diversity) గాంచుటయే బుద్ధికి పరమావధి.

జ్వాల రేఖాకృతిఁ గాంచిరి, యక్షర విలా
సా, ప్రోవవే మర్త్యులన్?

విధి సముచ్చారణ స్థాన భేదమునను
వర్గభావంబునన్ మానవ ప్రతతికి
సంచిత జ్ఞాన నిక్షేప సరణిఁ గంటి
వవిది తాద్యంబ, లిపి శారదా మదంబ.

కర్పూరాదుల వృక్షకాండంబుల న్నాటు
లీలలఁ గంటివి లేఖ[10] నాఖ్య;

---

9. విశదమగుటకు ఉదాహరణము; ఫినీషియాది భాషలలో 'బెత్' అనగా గోడతో గట్టబడినయిల్లు, మనకు 'భిత్తి' అనగోడ, కాన ।] ఈ రూపము మొదట 'బెత్' (భిత్తిక)ను తెల్పెను. పిదప యీ రూపము బిత్ అనియో బెత్ అనియో మాటయొక్క మొదటి భాగమును తెల్పెను. ఆవెనుక 'బె' లేక 'బి' యను ధ్వనిని తెల్పెను. ఆ పయిని అందుండు బవర్ణమును మాత్రము దెల్పెను. ఈ రూపమును మారి మారి *b*, *B*, ᗷ రూపముల నందెను. అట్లు మారినను దీనిపేరు బెత్ (బీటా) గనే యుండెను. "బ" యని తరువాత సంస్కరింప బడెను. అట్టులే ఛాషలన్నిటను మొదటి యక్షరమగు అ, A, లేక ఆల్ఫా యనునది అలెఫ్ (ఎద్దు తల లేక యెద్దు) అగు V రూపము నుండి కలిగెను. కామ (ఈశ్వరుడు) అగు olo రూపమునుండి ఞ "క" కలిగెను.

10. తొలుత నీరూపములు పెంకుల మీద చెక్కుచుండిరి. అందు కాయు ధము "లిఖున్" అని అస్సీరి యాదులలో (క్రీ. పూ. 5000) అను చుండిరి. దానినుండియే లిఖ్, లేఖ న్యాదులు అని నామతము. సంస్కృతమున సరియగు వ్యుత్పత్తిలేదు.

రెల్లుగుజ్జులఁ ప్రౌఢి నల్లిన పటముల
వ్రాయుటఁ గంటివి వర్ణ[11] మనఁగ ;
ప్రస్తరంబుల శైలభాగంబులం గాడి,
శాశ్వతఁ గంటి వక్షర[12] సమాఖ్య ;
" అలిఫి " నాదినిఁగల్గి యలరుటఁ గంటివి .
లిపియన, లిఫియన, లిఖి[12] యనంగ ;
పట్టలను దాటియాకులఁ గట్టు గ్రం[14]థి
నుంట గ్రంథంబ వైతి; వీ వొక్క వేళఁ
దోలుపటముల నుంటఁ గాఁబోలు పుస్త[15]
కంబ వయి శారదా, నిధానంబ వయితి.

---

11. ఈజిప్టులో 'పెపిరస్' అనురెల్లుతో .చాపలవలె నల్లి, రంగులతో వ్రాయుట యుండెను. కానవర్ణము. ఇంగ్లీషు పేపర్ అనుదాని కిదియే వ్యుత్పత్తి. లేక వేదముల ధ్వనియను నర్థమిచ్చు 'వర్ణమును' చూపునదగుట వర్ణమాయె ననవచ్చును.

12. క్షరము (నాశము) కానిది అని. ధ్వని క్షరమనుట వేద గౌరవము గల యార్యుల కసంబద్ధము. శిలా లిఖితములు నాశనము కావని చెప్ప నక్కర లేదు.

13. లిపిలో ద్వితీయాక్షరము, పి, ఫి, ఖి యగుట, ఈ మూడునుగాని ఇంగ్లీషు *ph* బోలు ఫ్ అని తెలియనగును. లిపియనునది ఈధ్వని నిచ్చు 'లిఫి' లేక (అ) లిఫ్ అగును. అదియే పురాతన భాషలలో తొలియక్షరమగు అలెఫ్ (*Aleph* = ఎద్దుతల) యని నామతము. అమరమున లిపి, లిఖి రెండు రూపములున్నవి.

14. భూర్జ... తాళ, మొదలగు వానిని కట్టుగ్రంథి (ముడి).

15. 'పోస్త్' అనగా తోలు ఆది భాషలలో; తోలు ముక్కలమీద వ్రాసి కుట్టుట ఒక కాలమున నుండెను. పార్చిమెంటు తోలుపటమే. పొస్తక లేక పుస్తక మిదియే. సంస్కృతమున పుస్తకమునకు వ్యుత్పత్తి ఢొంకతిరుగుడు.

నైలునదిం జరించి పులి
　　నంబుల గీసిన చిన్న బొమ్మలున్ 16,
దేలుచు భారతాపగ, గు
　　ణించిన కోణ17 విచిత్ర రూపముల్,
శైలములెక్కి పర్షియను
　　సంగతి వ్రాయు త్రిభంగి రేఖలున్ 18,
చాలవె నీకతల్ తెలుప ;
　　శైశవ మందలి క్రీడఁ జూడఁగన్.

సింధునదీ తీర సీమల గంభీర
　　గతి నాడు నీ కప్పగంతులాట 19.

---

16. ఈజిప్టున నైల్ నదీ తీరమున తొలి లిపి బొమ్మల (వస్తువుల రూపముల) తోనే వ్రాయుచుండిరి. ఇదియే హిరోగ్లఫిక్సు.

17. ఇప్పటి 'మెసపటోమియా' లోని యూఫ్రటీసు నదికి తొలుతటి పేరు (యు) భరత్ - భరతనది. ఆ భూమికి భరత భూమియని క్రీ. పూ. 3000-4000 వరకుండెను. ఇట రాజ్యము చేసిన బాబిలోనియనులు రూప చిహ్నములను కోణ - శూల - ముల వలె వ్రాయుచుండిరి. ఈకోణ లిపికే క్యూనిఫారము లిపి యనిపేరు.

18. బెహిస్థూన్ దుర్గమ పర్వత శిఖరమున డెరయస్ వ్రాయించిన త్రిభాషాశాసనము. ఇందు 'లిపి' కి 'డిపి' యని యున్నది. పారశీకమునగూడ డ లల క భేదము.

19. సింధునదీతీరమున మహేంజొదారో యందు మిక్కిలి లోతున వ్రాతలుగల పెంకులు వెలువడు చున్నవి. కప్పగంతులు పెంకులతో నీటి యందు నాడునట్టి యొకయాట.

పాణిని తాతతోఁ బడి గడుసుదనంపుఁ
బోఁకల నాడు దోఁబూచు[20]లాట,

బుద్ధుని ముద్దుల మూటలై రంగారు
కుండలం గను బొమ్మరిండు [21]లాట,

బౌద్ధభిక్షుకులతోఁ పనవిహారంబుల
నాక్షరికంబన నాడు [22]నాట,

అల యశోకుని పీటఁ జెలరేగి రెండు వి
ధముల నీ వాడు కంబముల [23]యాట,

పిదప రాజులఁ బేరఁ బేరఁ బిల్చుచుఁ జిత్ర
ముగను రేకుల నాడు [24]బొమ్మలాట,

---

20. అచ్ అని హల్ అని నడుమ నక్షరము కనబడకుండియు కనబడునాట.

21. బుద్ధుని చిహ్నములను 'పిప్రావా' పాత్రమునకుంచి దానిపై వ్రాసిన వ్రాతలు.

22. గాలి నొక్కరు రూపించిన యక్షరమును ఇంకొక్కరు గుర్తించుట ఆక్షరికమని బౌద్ధ జాతకాదులవల్ల తెలియును. భిక్షుకులుండుచోట్లు విహారములు.

23. అశోకుని శాసనములు ఖరోష్ఠ్రి, బ్రాహ్మి, యని రెండు లిపులతోనే వ్రాయబడెను. లలితవిస్తరమున చెప్పిన 64 లిపులును ఆ తరువాత ప్రక్షిప్తము లే యనవలెను.

24. చిత్రములను (ఆయా రాజుల ధ్వజాదులగు బొమ్మలు) గలిగియుండు (తామ్ర శాసనములు) రేకులని యర్థాంతరము.

ఆట లిట్టివి మితిమీఱ 25 నాడినట్టి
బాల్యవేళల నీకుండు భాసు రాంగ
విలస నావ్య క్తతను 26 గని వినిన, నేఁడు
సాంగలావణ్య వగు నిన్నెఱుంగఁ గలమె?

కొ౦కిబికి వేసమెల్ల యెట
కోఁ చనఁ, జిత్రము దిద్దినట్టులన్
సకల విధాంగసౌష్ఠవము
చక్క బయల్పడ, రూపరేఖ లం

బకముల కింపునింప, జిగి
వత్రువలం దగి, ముద్దులొల్కు మౌ
క్తికములఁ గూర్చు హారము గ
తి న్నుతిఁ గాంచితి జవ్వనంబునన్.

యౌవనం బి ట్లమర లీల 27 నచ్చుపడుటఁ,
గాల పరిణామ భయ మించుకయును లేక
శాశ్వ తాకార రేఖల జగతి మనెదు
సార్థనామంబ, యక్షర శారదాంబ!

---

25. పద్యమున ఆఱు పెద్ద పాదము లుండుటయు మితి మీఱుటయేకదా!
26. నాటి యక్షరములు నేటివానివలె కానరావు: వంకర టింకరలనుట.
27. యౌవనంబు ఇట్లు అమరన్ లీలన్ అచ్చు (ముద్రణము) పడుట అనియు, యౌవనంబు ఇట్లు అమరలీలన్ (దేవతలకువలె) అచ్చుపడుట (స్పష్టమగుట) అనియు. అచ్చువలన అమరత్వము=నిత్య యౌవనము కలిగెను; మార్పులు లేవు.

స్మృతి కందని కాలపు సం
గతు లిపుడుం గాంచఁజేయు కరుణ, న్నీతో
క్షితి యెల్ల యక్షరం బగు ;
గత మనుటయె వ్యర్థ మగును గాదే దేవీ ?

జగమునఁ గల్గు సంఘముల
సభ్యత లెన్నఁ బ్రమాణ మీవు ; నిం 28
పగు భవదీయ రేఖ కన
నౌ నెట నద్దియ పుణ్యభూమి ; దు
ర్భగు లనఁ జెల్లు నా యెఱుక
వారిఁ గురుంబులఁ 29 బోలకుండ శ్రీ
మిగులుట మాపయిన్ కరుణ
మేకొనుటం గదె యక్షరాకృతీ !

కత్తికన్న మిన్న కలమ 30 యనెడి మాట
నీదు సేవ మనుటఁగాదె కల్గె ;
కత్తి వలదు మాకుఁ ; గామితార్థముగూర్చి
సర్వసుఖము లిమ్ము శారదాంబ.

---

28. నింపు=సమగ్రము- అన్ని ధ్వనులను తెలుపగల లిపి.

29. వీరు లిపి నెరుగకయింకను అనాగరకులయి యున్న వారిలో కొందరు.

30. జొన్నదంటు, రెల్లు మొదలగు వానితో చేసిన వ్రాతకలము. లాటిన్ భాషలో "కలమస్" అంటే రెల్లు. సంస్కృతమున "కలమాగ్ర పింగలా" చూడుడు. తెలుగున కలమన జొన్న, వెదురు లోనగు తేలిక వస్తువులతో చేసిన చిన్న పడవ. *lapsu calami* అంటే వ్రాత తప్పు - కలము పొరపాటు.

# ద్యోయానము.

## (చరిత్రాత్మక రచన)

ఇది 1925లోని రచన. గాంధీమహాత్ముడు భారతీయులను స్వాతంత్ర్య సమరానికి ఆయత్తపరుస్తున్న రోజులు. మొదటి దేశైశ్వర్యము, తరువాత సంక్రమించిన దారిద్ర్యము, దాని నిర్మూలనకు దేశీయులు పూనవలసిన కర్తవ్యము కరతలామలకముగ వారి వ్రాతలలోనూ, ఉపన్యాసములలోనూ కనబడేవి. దేశమున వార్త్రావాతలు నిత్యపఠనము లయినాయి. దరిద్రనారాయణుడు విశ్వరూపముతో ప్రత్యక్ష మవుతూండే వాడు.

ఆ వ్రాతలలో కొన్నింటిని చదువుతూ ఉండగా నా ఊహలు భారతవర్ష దారిద్ర్యమును గురించి చెలరేగసాగాయి. పిపీలికలు బంగారమును కూడబెడుతూ ఉండిన ఈ రత్న గర్భలో ధనము పుష్కలముగ నున్న దని దేశదేశములకు తెలుసును. దాని నాశించి ఎందరెందరో మనదేశమునకు వచ్చేవారు. పర్షియనులు, గ్రీకులు, హూణులు, మహమ్మదీయులు, మంగోలియనులు, యూరోపియనులు అందరూ భారత భాగ్యాన్ని ఆశించి వచ్చినవారే; చేతనయినంత దోచుకొని పోయినవారే.

పూర్వ మెప్పు డెంతటి దోపిడి జరిగినా, అనతికాలములో మరల దేశము తేరుకొని సంపదలతో తులతూగు తుండేది. కాబట్టే మరొక దోపిడిని ఆకర్షించేది. కాని, ఈస్టు ఇండియా కంపెనీవారు మనదేశములో కాలూనినది మొదలు, భారతవర్షము, తేరుకోవడ మన్నది లేక, నానాటికి తీసికట్టయి, ఒకటి రెండు శతాబ్దములు దురవస్థల పాలవుతూఉంది. విషాదకర మయిన ఈ విషయాన్ని కావ్య వస్తువుగా తీసికొని వ్రాయక తప్పదన్న భావోద్వేగము కలిగింది. చరిత్రల నవలోడనముచేసి కొంత విషయ సంగ్రహణము చేశాను. ఏయేదోపిడిలో ఎంతెంత మనదేశసంపద పరహస్తములకు పోయిందో చాలవరకు తెలుసుకోగలిగాను, ధైర్యము కలిగింది

అయినా ఒక్క చిక్కు కనిపించింది, ఈ దోపిడులు ఒక్క స్థలములో గాని, ఒక్క కాలములోగాని జరగలేదు. క్రీస్తు పూర్వము నాలుగో శతాబ్ది మొదలు క్రీస్తు వెనుక ఇరవైయో శతాబ్దము వరకున్నూ, సేతువు మొదలు హిమాలయా పర్వతముల వరకున్నూ అనేక సమయములలో అనేక స్థలములలో తటస్థించాయి. ఇటువంటి వేరువేరు ఘటనలను ఒక్కదార మున గుచ్చడానికే ఈ విమాన యానము కల్పించుకున్నాను; దానిలో కొన్ని పూవులుంచి, ఒక్కొక్క పూవు జారుతూ వెలుగునివ్వడమూ, ఆ వెలుగులో ఒక దేశభాగములో జరిగిన దోపిడి కనబడడమూ, మళ్లీ దోపిడి వరకు విమానము అంధకారమున సంచారము చేస్తూ ఉండడమూ, ఈ లాంటి విధానము నొకదానిని అవలంబించాను. ఈ విధానములో చివరి బ్రిటిషు దోపిడి ఈయా భాగమనక యావద్భారత వర్షమందు సంవత్సరాల తరబడిని, విధి విరామము లేకుండా, కంటికి కానరాని విధంగా సాగుతూ ఉండడం స్పష్టంగా చూపవచ్చునని ఆశించాను.

ఒక్క విషయము. ఈ పద్యాలలో నేను చేసిన వర్ణనలుగాని, జూపిన లెక్కలుగాని సంపూర్ణ సత్యములని మనవి చేస్తున్నాను. చారిత్ర కాధారములేని అసత్యముగాని అతిశయోక్తిగాని దీనిలో లేదు. దస్యులు, పారశీకులు, హూణులు, తైమూరు, నాదర్షా, యూరోపియను వర్తక సంస్థలు, అన్నియు సప్రమాణముగ వర్ణించినవే.

మన దేశానికి వచ్చిన బాబర్ మొదలగు మొగలాయీ చక్రవర్తులను ఈ దోపిడీ దారులలో చేర్చలేదు. కారణము : వారు ప్రజల దగ్గరతీసికొనిన ధనములను ఈ దేశములోనే వ్యయము చేశారు. సౌఖ్యా లనుభవించారు. అంతేగాని, దేశమును దాటించలేదు. కాబట్టే వారిని విడిచిపెట్టాను.

సంపూర్ణ సత్యములయిన ఈ విషయాలను కేవలము అసత్యమయిన విమానయానముతో ముడిపెట్టడం ఎంతవరకు సమంజసమో పాఠకులే

నిర్ణయించాలి. దేనికయినా మంచిదని ఇంగ్లీషులోని "truth devoid of imagination is not so desirable as fiction that resembles truth" అన్న నానుడిని ఆశ్రయించాను.

అంతేకాదు. గ్రీకు భాషలో కవిని Vates అంటారు. వాటిస్ అంటే చూచువాడు. జరిగిన సంగతి తన దృష్టికి కనబడినట్టు - తన కంటి అద్దాల రంగుతో అన్నమాట - వర్ణించేవాడు అని అర్థము. ఈ వాటిస్ నే మన సంస్కృతములో విపశ్చిత్ అంటారు - బాగా చూచువాడు అని. దీనిని బట్టి కవిపని ఏమిటంటే, ఉన్న సంగతులను తన దృష్టిని చూచినట్లు-ఉన్నది కనినట్లు వ్రాయడమే అని స్పష్టము. ఈ కావ్యములో నేను చేసినది గూడ అంతే. అర్థాంతరము వల్ల ఉన్నది (వాస్తవమయిన విషయము) కన్నటు (విమానమునుంచి పూవు వెలుగులో చూచినట్లు) వ్రాశాను.

ఈ రచనలో నా కాధారాలు కొన్ని :

| | |
|---|---|
| Elliot : | History of India. as told by it's own Historians 7 Vols. |
| Elphinston : | History of India. |
| Ferishta : | History of the Deccan. |
| Wheeler : | History of India. |
| Gibbon : | Roman Empire. |
| etc. | etc. etc. |

# ద్యో యా న ము

ఉన్నది కన్నటు వ్రాయుట
కన్నఁ గవికి మేలు లేదుగద; తాత్పర్యా
ఖ్యున్నతి నారసి రసజ్ఞు
లెన్న, నలంకార రచన లేలా నాకున్?

స్వాంత విస్ఫూర్తిలేని వాస్తవముకంటె
సత్యముం బోలు కల్పితసరణి మేలు,౧
కానఁ, గల్పనా భావ సంకలన గరిమ
నిజా౨మె వ్రాసెదఁ జదివి చింతింపుఁ డనుచు.

దివ్యగంధిల * సద్భావ దృప్త సరస
కావ్య మదిరా రసంబును గౌతుకమున
నానియాని, ప్రమత్తత నఱనిముసము
దెఱచుఁ గన్నుల నిద్రఁ జెందితిని పగలె.

లలిత కౌశేయశాటి డోలగ నొనర్చి
నట్లు; పంచమీ చంద్రరేఖాంచలములు
రెండు నొక్కటఁ గట్టిన ట్లుండు నొక్క
దివ్యయానంబునం దున్న తీఱుఁ గంటి.

---

౧. నిజామియను పారసీక కవీశ్వరుని యూహ క్రీ. వె. 1250.

౨. ఈ పద్యావళిని దస్యాదుల రూపస్వభావ ప్రవర్తనాది వర్ణములకెల్ల వేదములును చరిత్రలును బ్రమాణంబులు; కల్పితములు గావని యెఱుంగునది.

* దివ్యగంధి (గాంధి)భావ... అని గూడ. లసత్

సారథిసున్న, చక్రముల
        సంగతి శూన్యము, ఱెక్కలుండు నా
ధారియుఁ గాదు, ధూమపు వి
        ధానముగూడ హుళక్కి, విద్యు దా
ధారము లేదు; కీళులును
        దంత్రులు నారయఁ బూజ్య, మైన, సం
చారముఁ జేయఁ బై కెగసెఁ
        జయ్యన నద్ది వియత్తలంబునన్.
ఆరీతిం జను నావిమానమున కా
        హా! చుట్టుఁ గన్పట్టెఁ, బ్రా
కా రాకారము నంది, సూఁదిమొనకుం
        గాసంత సందీక, నీ
హా రాతీత గభీర శైత్యమున జీ
        వాంశంబు ఱాఁజేయు పెన్
దారిద్ర్యంబన, నంధకార మతి
        సాంద్రంబై, కరగ్రాహ్యమై.
ఆ విచిత్రయాన మందున, వింతలై
యమరభూరుహాముల సుమము లనఁగ,
సౌరభముల మానసంబును లోఁగొనఁ
జాలు నలరు లలరు శతము లగుచు.
అందున నొక్కపూవు, తన
        యంతనె జాఱిపడంగ, దాన నే
మందును! దివ్యతేజ మొకఁ
        డద్భుత లీల జనించె; నందు నా

హైందవ పశ్చిమోత్తర మ
హా మహిభాగ నిసర్గవైభవం
బందముమీఱఁ బాణితల
మందునఁ గన్నటు దోఁచె నొక్కటన్.

కనక విభూష ణావళులు,
గట్టి యయోమయ పట్టనంబులున్,
ధనములు, సుందరాంగులు, న
నాదిచరిత్రముఁ గల్గుపాత్రులన్
ఘన నిభ గాత్రులన్, మిత వి
కస్వర నేత్రుల, యజ్ఞశత్రులన్
గనుఁగొనఁ గల్గెఁ గొందఱను
కంధి పరీత మహీశ పుత్రులన్. [౩]

వారలఁ బాఱఁదోలి, కృషి
వర్తను, [౪]లావులు నావ లశ్వముల్
తేరులు గల్గి బేరములఁ
దేఱిన ధీరులు, గౌర సుంద రా
కారులు, దీర్ఘ బాహులు, మ
ఖ ప్రమ దాత్ము, లుదార చింతనుల్
బారులఁ జొచ్చి నిల్చిరట
భవ్య విచార విదారి తారులై.

---

౩. వేదములఁగల దస్యుల వర్ణనము. ఆర్యులకుఁ బూర్వ మాసేతుశీత నగమును వీరలదే. అనార్యులదే.

౪. ఆర్యుల యీ యాకార సముద్రయానాదులు వేదముల గాంచనగు.

చక్కని కన్నులుఁ, దిన్నని
ముక్కులుఁ. దీర్ఘమైన చిబుకములు, దరహాసం,
బుక్కునుఁ, తేజముఁ, గనవే
కక్కట! చీఁకటులు మూసె నంతన్ వింతన్.

అలరొం డుర్లఁగఁ గంటి నొక్క పచన
వ్యాపార తుల్యుండు, ౫ మ
న్నుల బంగారు రజంబు మించు నల సిం
ధు ప్రాంతమందుండి, యెం

తెలపై నాయిసు మేఁడు నేఁడును వడిన్
నిండించి, దేశంబు నా
వలఁ జేరంజని, వైభవంబున నరి
వ్రాతంబు వేధించుటన్.

కోట కొమ్మల బొమిడికం, బోటలేని
యతని బలువిల్లు, నఱచట్ట, యసము చదల
మెఱపులం గొల్పు చక్కని గఱుల సిడము,
చీకువాలున నంతలోఁ జెన్నుఁ దఱిగె.

అంత మఱికొంత వడి కావిమానమందలి క్రొన్నన యొందు
నేలరాలుటయు, నందుద్భవించిన ప్రకాశఁబున,

౫. ఈతఁడు డెరయస్ అను పారసీక చక్రవర్తి. క్రీ. పూ. 486. పారసీకుల భాషయు నాచారములును నార్యులవి వలెనుండెననియు, నీ యాకారాదులును, బెహిస్తూన్ శాసనమున దెలియనగును. వాని సర్వ రాష్ట్రాదాయమునందు మూడవ పాలును, అనగా సం॥ 1 కి ఒక క్రోటియేబది లక్షల రూప్యముల నీ దేశభాగమే యిచ్చుచుండెను.

బిఱబిఱ దోఁచ నొక్కఁడు, సు
        భిక్షము, నాప్య, మమోఘ వీర్యమై
కొఅఁత నెఱుంగనట్టి యట
        కుం జనుదెంచి, యెట్లైన నేమి ?, యా
చిఱుతఁడు ౬ భూషి తేభ హయ
        శిక్షిక హేమ కరండ కోటితోఁ
గిఱికొను మబ్బుఁ జొచ్చెఁ దుల
        కింప ధనంబులు, పశ్చిమంబునన్.

మబ్బున నేఁగు చుండుటఁ, బ్ర
        మాణము నాకనుదోయి కేదియే
నబ్బదు గాని, పచ్చిక బ
        యళ్లనుఁ బైరుల వీఁచు గాలి తా
నిబ్బడి వాసనల్ నెఱప,
        హృద్య నిరంతర మంగళధ్వనుల్
గుబ్బతిలంగ, వచ్చె, జన
        కోటి ముదంబును ౭ బెంపుఁ దెల్పుచున్.

అట్లు మహావేగంబున నాద్వ్యాయానం బంధకార విహారంబు సేయుచుండ మఱియొక విరి యయాచితంబుగ భూస్థలిం బడుటయు,

---

౬. అలెగ్జాండరను యవన రాజు-క్రీ. పూ 326-దేశము సప్తనదీ జలమయము (ఆప్యము). స్నేహమున నాగరాజాదుల వలనను, కయ్యమునఁ బురుషోత్తమాదుల వలనను, వాని సేన నొక్కొక్కనికిఁ గిరీటములు స్వర్ణ పాత్రలులోనగు నవి చిక్కెను.

౭. చంద్రగుప్తాశోకాదుల కాలము,

ఇల్లుం దల్లుల నొల్లక,
పల్లంబుల క్రింద నుంచు పచ్చి పలలమున్
జొల్లులు గాఱఁగఁ దిని ఱం
పిల్లెడి కల్లరి పిసాసి పిల్లలఁ [౮]గంటిన్.

ప్రజలఁ బీడించి కాల్చెడి ప్రతిభ, కోట్ల
ధనము దోఁపు గైకొని పోవు ధైర్యమహిమ,
యబలలం గొట్టి చెఱపట్టు న్యాయబుద్ధి,
యన్ని, ముసురుఁ జీఁకటి నంత నంతరించె.

కాలం బుండిన యంతపట్టు మఱవం
గా రాని యిక్కట్టులన్
జాలం గాంచియు, దేశకాలముల స్వా
స్థ్యం బెట్టు దో నాఁడు! సౌ
ఖ్యాళిన్ వైలమ తేలఁ జాలె[౯] ; నిది స
త్యంబంచుఁ దెల్పంగ, నా
గాలిం దోఁచెను ప్రౌఢ వోదిత కలా
కల్యాణ ముద్రాంకముల్.

కమ్మ సుమం బొకండు దొఱఁ
గంబడి, తొల్లిటియట్ల సత్ప్రకా
శమ్మును గ్రమ్మ, నందుఁ గనఁ
జాలితి సుందర దేవహర్మ్య బృం

---

౮. పిశాచజాతులు. ఘోరాచారములంబట్టి కానోపు, వారు పిశాచులకుఁ బుట్టిరని ప్రసిద్ధి. గిబ్బన్ "రోము వినాశము" ను జూడుఁడు.

౯. గుప్త చక్రవర్తులును హర్షాదులు నేలిన కాలము.

దమ్ములు గుందనమ్ము రత
నమ్ములు సొమ్ములు విగ్రహమ్ము లం
దమ్ములు శిల్పముల్ బహు వి
ధమ్ములు దేశపు వైభవమ్ములున్.

కోరిక స్ఫోట కాంకిత ము
ఖుండొక దిట్టడు ౧౦ రేగి, భీకరా
కారులుఁ దోలుమస్తుల మ
గల్ తనుఁ గొల్వఁగ, సారెసారెకున్
జేరి, ప్రసిద్ధ గోపురపు
శిల్పములన్ బడఁగొట్టి, పైఁడి భం
డారము, రత్నరాసులు, బి
డారములం గొనిపోయె దవ్వులన్.

అంధకారంబు చూడ నీయక చెలంగె
మున్ను నెన్నఁడుఁ గన్నదివిన్నదియును
గాని యా చూఱ ధనముల, నైననేమి?
దేశసంపద మఱలను దేటికొనియె.

---

౧౦. గజినీమామూదు 11 వ శతాబ్దము. ఈతఁడు సోమనాథాది దేవాలయములఁ బడఁగొట్టి, తీసికొనిపోయిన ధనము "7000 పౌన్లు బరువుగల బంగారు నాణెములు, 6000 పౌ. బరువు బంగరు గిన్నెలు, 15000 పౌ. బంగరు కణికెలు, 129000 పౌ. వెండియు, 150 పౌ. బరువు మించు వజ్రములు, కెంపులు, ముత్యములు, పవడములు" (25పౌ. 1 మణుగు.)

తమి కెఱ కప్పి, యంత పతి
త ప్రసవప్రభఁ బాయ, నే యపా
యముఁ గన నట్లు గ్రమ్మఱ మ
హావిభవంబునఁ దూఁగు దేశ భా
గముఁ గని, దోఁచె నొక్కరుఁడు౧౧
కాంతిలు వజ్ర సమూహ మైదు నూ
ర్లు మణుఁగు; లెన్న నేల? యతఁ
డుం గొనిపోవు ననూహ్య సంపదల్?

మఱల ముసరు నిరుల నాయానం బెగురుచుండ మఱి
యొక్కపుష్పము భూమింబడి వెల్గు నిచ్చుటయు,

హాహా రావము లుప్పతిల్ల జన లో
కాలాత విఖ్యాత దు
ర్దాహుం డొక్కఁడు, కూళ, కుంటి౧౨, ప్రజకుం
దారిద్ర్యముం గూర్చి తా
నూహాతీత ధనంబు నందియును, గ
ర్వోద్రేక మో! హింస ను
త్సాహంబో! పొనరింపఁ బాల్పడె నవా
చ్య క్రూర కార్యావళిన్.

---

౧౧. మహమ్మదు గోరీ. 12 వ శతాబ్దము. మహమ్మదీయ చరిత్రకారులే పద్యమునకుఁ బ్రమాణము. ఆ కాలమున గోరీయంత ధనికుఁడగు రాజు లేకుండె.

౧౨. ఈతఁడే తైమూరు. పదునాల్గవ శతాబ్దము "The Lame Fire-brand (అలాత) of the world." ఈతఁడు స్వీయ చరిత్ర వ్రాసెను.

మిత్తియు నుత్తముండ యన
మించి, జనంబులు బీన్గుపెంటగాఁ
గుత్తుకలన్ విలాసమునఁ
గోసి, యనాథల నేచి, చేయి నొ
వ్వెత్త ధనంబు దోఁచి, పరి
తృప్తిగ నూరులు గాల్చి, కేరు నా
యుత్తముఁ, దుట్టిఁ గట్టుకొని
యుండక, చేరెను గాల గర్భమున్.

ఇంతపాటుఁ గనియు, నిలసిరి రేకెత్తి
విరియసాగెఁ౧౩ గన్ను విందు గాఁగ ;
వేరు చెడకయున్న, వివిధాంగ శోభతో
గాసిఁ బాసి యలరుఁ గాదె లతలు ?

తొల్లిటి యట్లనే కుసుమ
ధూత తమిస్రమునందుఁ గాంచితిన్
ఢిల్లి పురంబు, శేషుఁడు గ
ణింపఁగరాని సిరిం జెలంగఁగా,
నుల్లస మాడుటో ! యతిశ
యోక్తియొ ! నాఁ జను ద్రవ్యరత్నముల్
గొల్లున నెవ్వఁడో౧౪ యినుప
గుండెల మిండఁడు కొల్లఁగొట్టుటన్.

---

౧౩. మొగలాయీ చక్రవర్తుల యైశ్వర్య కాలము.

౧౪. నాదరుషా 18 వ శతాబ్దము. జనుల నపరిమితముగఁ బీడించి దోఁచిన ధనములు ఊహాతీతము.

రతనాలా, నాణెములా,
యతి సుందరమైన నగల, యా దోఁపిడికిన్
మితిఁ దెల్పఁగ గతిగలదే?
కతవలెఁ గాన్పించు నెమిలి గద్దియ యొకటే!

వీటఁడియు, సేన౧౭, యాత్మీయ విపుల తృష్ణ
సైతమును మీఱఁ దోకొన్న సంపదలును,
బోయి గాఱడి తెఱలోన మాయఁ బడియె;
కాని, విహరించుచుండె విమాన మటులె.

ఈ దేశంబు వరాల తీవ౧౮ యనఁ బే
రెత్తందగుం గ్రమ్మఱన్;
కాదే, నా సుమకాంతి, నొండొరులకుం
గానీక, స్వార్థాత్మ, నెం
తోదూరంబున నుండి శ్వేతముఖముల్
నోరూర రానేల? యే
లా దోఁచంగ ననేకకోటి పరిసం
ఖ్యంబైన ద్రవ్యంబులన్?

బేరములు, వారి వింత వ్యాపారములును,
సంపదలుఁ గప్పు సంతమసంబు మాన్చి,

---

౧౭. నాదర్షా సేన యెనుబదివేల జనము.
౧౮. ఐరోపా దేశీయులకిది "పెగోడా ట్రీ - వరహాల చెట్టు" అనా యాసంబుగ వరాలరాల్చికొన, బుడతగీచులు, హూణందులు, ఆంగ్లేయులు, పరాసులు ననేక వర్తకసంఘములుగ వచ్చిరి, రాల్చిరి.

యంతఁ జూపె లతాంత నితాంత కాంతి
సర్వ సాధారణం బనఁ జాలు జగతి.

అవ్వేలుఁగునఁ బూర్వరీతి ఘోరవిశేషంబు లేవియుఁ
దత్క్షణంబున కానరామి,

క్రూరులు రారు; దోఁపిడులుఁ
గొల్లలు గానను; కాల వూరులుం
బైరులు; సంకులం బనఁ గ
నంబడ; దేమిటి కీ సుమవ్యయం,
బారయఁ జాల..."మూర్ఖ! తెలి
యం గనఁజాలవె, వే ముఖంబులన్
బారులు గట్టి, చీమలు నె
పంబున నేమియొ కొంచుఁ బోవుటన్?"

అశరీరంబగు నావాణి నాలకించి, భయ విస్మయంబుల
తోడ నించుక పరిశీలించిచూడ,

రారాపిళ్ల నగల్ పగల్ గొనఁగ, నో
రా! యిల్లునుం గుల్లయై
యోరెం బన్నది దూరమై, దినములల్
యోగంబె భోగంబునై,
ఘోరాచారమె సారమై, శిశుమృతిం
గోడాడుటే పాడులై,
దారిద్ర్యం బతి దారుణాకృతినిఁ బ్ర
త్యక్షంబుగాఁ దోఁచినన్.

చిటి పొటి బరువులఁ జీములు
కుటిలగతిం గొంచు బోవు గుణలేశము లె
చ్చటి వని లోచనముల నే
నటు ద్రిప్పితిఁ; జెప్పనెట్టు లకటా! నాకున్.

అఁకొను నెల్ల లోకముల
కన్న మవారిగఁ బెట్టి, నాకముం
దాఁకు ననేక శాఖల స
నాతన సత్కళ లుట్టఁగా, దివిం
బాఁకుచుఁ బూర్ణశోభఁ దని
వాఱెడు గట్టి వరాలచెట్టు పెన్
గూఁకటి వేరునే పొడిగఁ
గొర్కెఁ బిపీలిక లీతి పోలికల్.

ఆకులపాటును, శాఖలు
బోకారుట, నిల్వనీడ పొసఁగమి, కఱవున్
జేకూరుట, మనపాలిటఁ
గాకుండునె? చీమ లన్న గాములు గావే?

చూడనె తొల్లి యిక్కటుల
గ్రుక్కియు, నింతటఁ దేఱఁబాఱి తూఁ
గాడు సమస్త సంపదల
కాకరమౌ నటు దేశముంట? ని
ద్దేఁడులునున్ శతాబ్దములు
నేఁగుట తోఁచును గాని, లేమి పో

కాదు తెలుంగుఁగానఁ; బువు
కాంతియు మాయదు; యాన మాఁగదున్.

పొలము నెపుడొ దిష్టి బొమ్మకుఁ గట్టిన
చింకిపాఁత యైనఁ జిక్కు ననుచు
దొంగిలించి మానము గాచుకొనునట్టి
కటికిలేమిఁ గాంచఁగలనె నేను?

ఇంక నీ దుస్సహ ప్రదర్శనంబు మాయింపఁ జీఁకటులు
మూయకుండుటం జేసి,

అడలు కుమారునిం బొదుగు
నమ్మ కరంబులో, పీతదార్ఢ్యముం
బడిబడిఁ గూర్ప రోగులకుఁ
బట్టెడు నిద్రయొ, దుఃఖరాశి రా
యిడి దరిఁజేర్చు చల్లనగు
మృత్యువొ నా, నిరు లేల క్రమ్మ వొ
క్కడరున, దేశభక్త నయ
నాళి నిపీడన కంటకాకృతిన్?

యానవిలాస మింక సమ
యం జనుఁగాక! నభాన నిల్వరా
కే నిఁకఁ దల్లక్రిందుల మ
హిం బడి చచ్చెదఁ గాక, లేమి నీ
దీనులఁ జూడఁజాల నని,
తెంపరినై, పువు నెత్తినై వ౧౭, నా

---

౧౭. ఇంతదనుక రాలుచుండిన పూలు తమంతఁ దామే పడుచుండెను.

హా! నెలకొంటి నింటను, సు
ఖాసన, మెప్పటి పుస్తకంబుతోన్.

మబ్బుతెఱ, లుబ్బు వెల్గులు,
జొబ్బిల్లెడు కల్మి, పెఱల చుబ్బనచూఱల్,
దబ్బర తేరుం జని యెను;
నిబ్బరమగు లేమివగపె నిల్చెం దిరమై.

చటుల దరిద్ర తాసమ వి
షాదము నాశమునంద. మందునాఁ
కటి పెనుచిచ్చు లారఁగ, ది
గంబర దుస్సహ దైన్యవృత్తి యొ
క్కట మటుమాయమై చన, జ
గంబు విడంబనలేని శాంతి దోఁ
గుటఁ గనఁ, జక్రరక్ష ౧౮ సమ
కూర్చుత మా ప్రణయంపుమూర్తి, సం
కట సమవర్తి, యార్తి తొలఁ
గంగ నమోఘ దయానువర్తియై.

---

౧౮. చర్ఖా అనిహార్యదయము.

# కావ్య రచన

## (సాహిత్య విషయ రచన)

దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్వహస్త లిఖితమయిన జాబు వచ్చింది: "ఈ సంవత్సరం గూడా తమ రచనతో ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక నలంకరించవలసింది." అని. నేను నెల్లూరులో ఉన్నాను చుండీ జమీందారుకు ప్రభుత్వము నియమించిన సంరక్షకోపాధ్యాయునిగా. ఆ జాబందినప్పుడు నా పరిస్థితి ఎలాగుండే దంటే: నాకు ఆనాడున్న ఆస్తి అంతా, బంగారము వెండి రొక్కము వెలగల వస్త్రములు అన్నీ, దొంగ లప హరించుకు పోయారు.

అదొక చిత్రమైన సంఘటన:- మా పెద్ద కూతురు వివాహము దగ్గర పడుతూ ఉంది. నా భార్య ప్రోద్బలము వల్ల మేము సకుటుంబముగ యాత్రకు బయలు దేరాము. బయలు దేరుతూ, నగా నట్రా అంతా ఒక మంచి పెట్టెలో పెట్టి, ఆ పెట్టె నొక ధనిక మిత్రుని యింటిలో మేడమీద భద్రపరిచి, నిశ్చింతగా బయలుదేరాము. వారం రోజులు యాత్ర సాగించు కొని ఒకనాటి రాత్రి 7గంటల వేళకు నెల్లూరు చేరుకున్నాము. ఇల్లు చేర గానే మావాళ్లు ఆ పెట్టెను తెప్పించుకుందా మన్నారు. ఈ రాత్రి ఎందుకు? రేపు తెప్పించుకుందా మని నేనన్నాను. ఆ రాత్రి యడవల్లి సూర్యనారా యణ జట్టు వారి నాటకము లక్ష్మీనరసారెడ్డి హాలులో జరుగుతుందని తెలిసినా, ప్రయాణ బడలిక వల్ల వెళ్ళకుండా పడుకున్నాము.

రాత్రి 12 దాటింది. ఒక యానాది నౌకరు మా తలుపు తట్టి, నా మిత్రుడు పిలుస్తున్నాడని చెప్పాడు. ఇంత రాత్రి ఏమిటా అని మిత్రు డింటికి వెళ్ళాను. అక్కడ తెలిసింది మా పెట్టెను ఎవరో ఆ యింటి నుంచి దొంగిలించుకు పోయారని. మిత్రుడు సకుటుంబముగ నాటకము చూడ డానికి, మేడమీది గది తాళము వేసి వెళ్ళాడు. దొంగలు తాళం బద్దలు

కొట్టి, ఆ యింట్లో నుండిన నాలుగయిదు పెట్టెలలోనూ మా పెట్టె నొక్క దానినే ఎత్తుకొని పోయారు. కాళీ పెట్టెమాత్రం వాళ్ళ పెరటిలో పడివుంది. పోలీసువారు దర్యాప్తు ప్రారంభించారు. ఆ మిత్రుడి మీద నాకు అనుమాన మున్నట్టు వ్రాసి ఇమ్మన్నారు. 'ఆ పని మాత్రం నేను చేయను. ఆయన యందు నా కెంతో నమ్మక ముండబట్టే నా పెట్టె నక్కడ ఉంచాను' అని అన్నాను.

20 రోజులు దర్యాప్తు సాగుతూ ఉంది. కలక్టరు, డిప్టీ కలక్టరు, డిప్టీ సూపరింటెండెంటు గారలు, నా యందలి అభిమానముతో, ఎంతో ప్రయత్నించారు. లాభం కనబడ లేదు. మా ఇంటిలోని వారు ఎంతదుఃఖిస్తున్నారో చెప్పలేను. నా భార్యకు మతిభ్రమణం కలుగుతుందేమో అన్నభయంగూడా నాకు లేకపోలేదు.

అటువంటిసమయంలో వచ్చింది దేశోద్ధారకుల జాబు. నవ్వువచ్చింది- దుఃఖహాసం అందామా? ఆనాడు అల్లసాని పెద్దన్న గారి

"నిరుపహతి స్థలంబు, రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మ కింపయిన భోజన, ముయ్యెల మంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే ?"

అన్న పద్యము జ్ఞాపకము వచ్చింది. కావ్య రచనకు అనుకూల పరిస్థితులను గురించి ఊహలు సాగాయి. బాహ్య ప్రకృతి లోని కొన్ని చక్కని సన్నివేశాలు కనిపించినప్పుడు కావ్య రచనకు ప్రోత్సాహము కలుగుతుంది. అలాగే, మానవ జీవితం లోని కొన్ని సంఘటనలు కవితను పురి కొల్పుతాయి. ఇది మన మెరిగినదే కదా!

ఈ ఉద్దేశముతోనే, ప్రకృతి సన్నివేశాలను కొన్నిటినీ, మానసిక సన్నివేశాలు కొన్నిటిని దీనిలో వ్రాశాను. దీనిలోని "కరువలి వానకున్" మొదలైన పద్యాలలో కేవలము స్వవిషయము, కొంచెము తెర మరుగునా, మనవి చేశాను.

మొన్న (1960 సెప్టెంబరులో) ఉత్తర హిందూస్థానంలో ఈలాంటి దుర్ఘటనే జరిగినట్టు పత్రికలలో చూచాము. పెళ్ళివారు, ఎనమండుగురట, వర్షానికి భయపడి ఒక దేవాలయమంటపములో తల దాచుకున్నారట. అక్కడే ఆ మంటపము కూలిందనీ, వారందరూ చనిపోయారని చదవగానే నాకీ పద్యం స్మరణకు వచ్చింది. ఆనాడు ఊహించి వ్రాసిన కల్పన ఈనాడు నిజమయినదని అనిపించింది.

పర్యవసానం గూడా మనవి చేస్తాను, క్షమించండి: ఒక సంవత్సరం గడిచింది. పోయిన సొత్తు దొరకలేదు. నేను మరొక చోట పనిచేస్తున్నాను. సంవత్సరం, సరిగా నా సొత్తు పోయిన తేదీనే, ఆనాటి నెల్లూరు ధనిక మిత్రుడు, ఉన్నట్లుండి, మతిభ్రమణ లక్షణాలు కనబరిచాడనీ, మద్రాసు నుంచి అతని సోదరుడు వచ్చినప్పటికి వెర్రి విశేషించిందనీ, మద్రాసు పిచ్చాస్పత్రిలో నతనిని ఉంచారనీ, నెల్లూరు మిత్రులొకరు నాకు జాబు వ్రాశారు. " ఆ తేదీనే ఇది జరగడం చాల విచిత్రం కాదా "అన్నారు వారు. తరువాత కొన్ని నెలలకు అతడు చనిపోయాడు గూడాను.



## కావ్యరచన

గరిమను దేశగౌరవ మ
ఖర్వ పరాక్రమ వైభవంబులున్
బరఁగెడివేళ, నుయ్యేలల
పై సుఖముండి, కృతు ల్రచింపఁ "గ
ప్పుర విడె మాత్మ కింపయిన
భోజన మింక నదేది యేదియో
దొరకినఁ గాదె" యంచు నొక
తొంటికవీశుఁడు సెప్పె నప్పరో!

పరమది; యట్లు వ్రాయు విభ
వంబు నదృష్ట వశంబునన్ గడిం
చిరి మనవారుగొందఱు వి
శేష వివేక విలాసు; లంద ఱి
ప్పుడుసునఁ దూఁగుటుయ్యేలల
భాగ్యము నందఁ బోసంగు నెట్టు? లే
వెరవున లాఁతి సత్కృతులు
వెల్వడఁ గొంతు రుదార భావముల్ ?

అరయు రసజ్ఞ పాఠకుల
నా ముదుకందు వరింప, నొక్కఁ డీ
"ధరణి విశాల, కాలము తు
దం గన నట్టిది, భావసామ్య మొ
క్కరుఁడునుఁ గల్గఁడే ? కృతినిఁ

గాంచి ముదంబును బొంద? నేఁటి వా
రరుసము నందుకున్నఁ జనె"
యంచు రచించె రసాంచితంబుగాన్.

ఒరులిది వింమరా యనెడు
నూహ నెఱుంగక, పొంగి, తానుగాఁ
బొరలి, హృదంతరాన నెడ
ముం గనఁజాలక, వెల్లిగొంచు, వే
వ్వరు వలదన్న నాఁగక, గు
బుల్కొనఁ బాఱు విశేష భావముల్
దొరకక, చెప్పుటెట్టులని
తొంటికవీశులు సాటఁగూడదే?

పరువపు శాద్వలంబు, నొక
పజ్జ మనోహర రావ మొప్ప వేఁ
బరువిడు కొండవాఁగును, సు
వాసనలన్ వెదచల్లు చల్ల తె
మ్మెరలును, సంజ కెంపుజిగి
మించు నభంబు, విహంగ గీతముల్
దొరకక చెప్పు టెట్టులని
తొంటి కవీశులు సాటఁ గూడదే ?

పరిసర మందు నంబునిధి,
భంగపరంపర పైఁ జెలంగ బం
ధురగతి మ్రోఁగు సానువులు
నుం, బరిసర్పిత చంద్రకాంతి, శీ

కరభర వాతపోతమును,
 గ్రందు రవంతయు లేని కాలమున్
దొరకక చెప్పు బెట్టు లని
 తొంటి కవీశులు పాటఁగూడదే?

సరసిజ సౌరభంబును, గి
 సాల కషాయిత రాగ రాగి యౌ
పరభృతమున్, మహాప్రకృతి
 పావనమూర్తిఁ గనంగఁజాలు ప్ర
స్తర రచితాసన బు, నెఱ
 సంజ వెలుంగు, మరుత్కిశోరముల్
దొరకక చెప్పు బెట్టు లని
 తొంటి కవీశులు పాటఁగూడదే?

విరసెడి పెక్కువన్నియల
 వీవననా నపరాశ వింత బం
గరు చెఱు వట్టు లగ్రమునఁ
 గ్రాల, విహంగమ కూజితంబు లం
బరమునఁ బర్వఁ బార్శ్వముల,
 స్వైర విహార వినోద సైరికో
త్కర పటుగీతి చాల వెను
 కన్ వినవచ్చుచు నుండు సుస్థితుల్
దొరకక చెప్పు బెట్టు లని
 తొంటి కవీశులు పాటఁగూడదే?

సిరి చిఱునవ్వులున్, వలపు
సేఁతలు, వన్నెలు, చిన్నెలున్, మనో
హారముగఁ గొన్ని వర్షము ల
నంతము లంచనుకొంచుఁ గాంచి. యీ
శ్వరకృప వింతరూపునఁ బ్ర
సన్నతఁ గాంచినయంత, నవ్వియున్
విరవిర నిట్టె మాయమయి
విన్నదనంబునుఁ గూర్చ, నింట సుం
దరియు సుతాదులుం దమ మ
నంబుల నున్న ఘనార్తి ప్రమింగి— దు
ర్భర పరితాప ఘోరవిధిఁ
బాసెనొ లేమిడి నేఁటినుండి నా—
నరు దగు నోర్పుతోడ దర
హాసము సేయుచుఁ దన్నుఁ జూచుటల్
దొరకక చెప్పు లెట్టు లని
తొంటికవీశులు పాటఁగూడదే ?

పొరిగొను నాఁకటం బొరలు
పుత్రుల బాష్పనిరుద్ధ దృష్టులం
బరపుచు నెత్తి యూఱడిలఁ
బల్కెడు సాధ్వినిఁ జూచిచూడ న
ట్లరసి, నిజార్తి విస్మరణ,
నాధునికం బగు లేమి నెంచఁగా

దొరకక చెప్పు లెట్టు లని
తొంటి కవీశులు సాటఁగూడదే ?

గరువముఁ గోలుపోయి, విధి
కట్టిఁడి సేఁతలఁ దొంటి పొంకముం
దొరఁగి, విలూనభూషయు, వి
దూషిత తేజయునై, క్షుధార్తితోఁ
బరిభవ మంది కుందు నొక
భాగ్య విహీననుఁ * గాంచినంతనే,
పొరపడకుండగా నచిర
పూర్వ పరిస్థితులందు దాని సు
స్థిర విభవంబు, శేముషియు,
దేజముఁ గీర్తియు నొక్కటన్ హృదం
తరమునఁ గోచరించ, నయ,
నంబుల బాష్పము లూఁటలూరఁ గా
తరమతి "దేవదేవ, భయ
దంబులు నీ చెయిదంబు" లంచు మే
గరుపడ నెంచు భావమును
జ్ఞానము బుద్ధివివేకసంపదల్
దొరకక చెప్పు లెట్టు లని
తొంటి కవీశులు సాటఁగూడదే ?

---

* భారతమాత యని భావము.

కరువలి వానకుం జడిసి
కట్టెదుటన్ బొడచూపు నొక్క ని
బ్బరమగు నమ్మకమ్ము గల
పటునఁ దాఁ దలదాఁచి, యద్దిరా!
శరణము నిచ్చె నీశుఁడని
సంతస మందుచు నందు నుండ, ని
ష్ఠురముగ నచ్చటే, శ్రుతిక
ఠోర విధంబునఁ బెద్ద పిడ్గు చె
చ్చెరఁ బడి, వాని నొక్కనినె
చిత్రవధం బొనరించి, యంతి కే
తర విషయంబు లింతయినఁ
దాఁకకయుంచుటఁ గాంచి, నాస న
బ్బురమున వ్రేలుపెట్టి, దివ
మున్ గని, యా పరమేశు లీలలన్
దర వినయంబు లొప్పఁగ మ
నంబున నెంచెడు సన్నివేశముల్
దొరకక చెప్పు టెట్టు లని
తొంటి కవీశులు పాటఁగూడదే?

---

# విజయనగ రాంజనేయము

## (చారిత్రక కథా రచన)

చిత్రం! పట్టపరీక్షకు నా ప్రత్యేక విషయం గణితశాస్త్రం: అభిమానం ఆంధ్ర సారస్వతం: ఆ రోజులలో విశేష పఠనం మన దేశ చరిత్ర గ్రంథాలు. ఆపఠనలో 'టాల్ బోయ్ వీలర్'(Talboy Wheeler) దొర వ్రాసిన ఇండియా చరిత్ర ఒకటి చదువుతున్నాను. దానిలోనిదే ఈ ముజాహిద్ షా కథ. విషయం విజయనగర రాజ్యానికి సంబంధించింది. షాహి చావు ఒక చిత్రమైన సంఘటన. వాడుకలో ఉన్న మన చరిత్ర గ్రంథాలలో ఈ సంగతి కనబడదు. ఈ కారణాల వల్ల ఈ కథను ఈ విధంగా వ్రాయాలని సంకల్పించుకున్నాను.

*దీనిలోని కథ:-* భామినీరాజు ముజాహిద్ షాహి చేతులార ఒక ఆంజనేయ ప్రతిమను గండ్రగొడ్డలితో నరకబోతాడు. ఒకముసలి బ్రాహ్మడు అడ్డువస్తాడు. షాహి అతడ్ని మొదట నరకి, తరువాత, విగ్రహాన్ని కొట్టి తనకసి తీర్చుకొని పోతూఉంటాడు. కొన ఊపిరితో ఆ బ్రాహ్మడు మహా పరితప్తమయిన హృదయంతో షాహిని శపిస్తాడు. దాని ఫలితమా అన్నట్టు, ముజాహిద్ షాహి తనయిల్లు చేరకుండా, దారిలోనే, నీచమయిన చావు చచ్చాడు.

గండ్రగొడ్డలి వ్రేటుకు గురియైన ఆంజనేయుడు షాహినిగూర్చి కటాక్షు లాడడం ఆక్షేపణీయం కానేరదనే భావిస్తాను.

# విజయనగ రాంజనేయము

పథిక, క్షణమాత్ర మాగుము పరుగు లిడక ,
నీవు మెట్టుచు నున్నది పావనంబు
సకల జననుతిఁ గన్న దేశంబు, వీర
విజయనగరంబు నమ్ము ; మీ వీటనున్న
చోద్యములనెల్ల కలయంగఁ జూడవేమి ?
చూచి, కాలచక్రంపు విశుద్ధఫణితిఁ
గాంచి, జగదధీశుని లీల లెంచవేమి ? ...

నగెద వేటికి ? హాస్యంపు పగిదిఁ గంటె ?
శిథిలమై, పాడువడియు, విశేష హైన్య
మందియుండిన యిచటఁ జోద్యం బదేమి
కలుగు నంచును నవ్వితో ? కాక, నాదు
కార్యమునఁ బోవ నితఁ డిట్లు గట్టుఁబాటు
సేయు టేమని హాసంబు సేసి తొలఁగొ ?

ఎఱుఁగవో ! ఆంధ్రజనులకు నెల్ల నొక్క
కావ్య ముండుట ? యీ రాజ్య గణన యదియె ;

ఇంక శైథిల్యమునుగూర్చి ... శంక వలదు.
స్తంభ శకలంబు లివిగావ, శాసనములు;
శిథిల నిలయంబు లివిగావు, శిల్పశాల ;
లివి దళిత కుడ్యములుగా, వహీనచరిత ;
లివ్వి ఱాలుగా, వక్షర బృందములగు.

వీనిఁ దద్రాజ్యసామ్రాజ్య విస్తృతిఁ గని,
'హాయిరే! రాజ్యములప్రోడ, హా! విజయన
గర మహారాజ్య. మివిగో జోహారు' లటంచు
నంజలి యొనర్చనివాఁడు నాంధ్రుఁ డగునె?
మరలు; మిటుజూడు, మిచటి యావరణలోన
వెలసియున్నాఁడు, మన మహాబలసుతుండు,
ఆంజనేయుండు, ప్రథిత వీరాగ్రగణ్యుఁ,
డతుల తేజుండు, భువన సమార్చితుండు;
నితని సేవింపఁ బతితుండు నుతినెసంగు.

.... .... ....

"అంజనీసుత జోహారు లందికొనుము;
ఏమి? దల గాయ మెటులయ్యె నీ ముఖమున?
వదన మెంతగ వసివాళ్లు వాడె నయ్యొ!
క్రూరుఁ డెవ్వాఁడు నిన్నిట్లు రూపు చెఱచె?
పాపి యెవ్వాఁడు నిన్నిట్లు భంగపరచె?
ద్రోహి యెవ్వాఁడు నీ కిట్టి దోసఁగు జేసె?
హృదయ భేదన మొనరించు నిట్టికృత్య
మెట్టి బాలిశ చేసెనో యెఱుఁగఁ దెల్పు
మొక్క త్రుటిలోన నవ్వాని యుక్కడంచి,
పట్టి పోకార్చి, ముక్కలుగొట్టి, కాక
కులములకు నెల్ల తుష్టిగా బలియొసంగి,
గుండియలమీఁదఁ జేయిడి పండుకొనెద;
మాంధ్ర రుధిరంపుఁ దేజంబు నంతరించి
పోవలే దింక; నాంధ్రుల భూరివిక్ర

మంబు నడుగంటఁగా లేదు; మహితకీర్తిఁ
గాంచినారలు మావారు, గండుమగ ల
టంచు నింకను మఱవ రీయాంధ్రు; లిట్టి
ఘోరకృత్యంబు సైచెడి వారు గారు.
తెలుపు మవలీల నెవ్వఁడా తెంపరిఁడో. "

.... .... ....

" బాల, యీలీల నీవేల జాలి వడెద ?
వాంధ్ర తేజంబు గలదె యీయవని నింక ?
సందియం బయ్యె; నెటులైన సరియె; కాని,
సావధానత విను మెట్లు జరిగెనో యిది.

"భామినీరాజ్య మల తుంగభద్ర కుత్త
రమున నేనూఱు సంవత్సరములక్రిందఁ
గర్వితాత్ముల పాలనఁ గాంచి వెలసె
నంచుఁ దెలియునా చరిత్రలయందు మీకు ?
ఆ నృపులలోన నొక్క ధరాధిపుండు,
చపలుఁడు, మహజాహి దనునట్టి షాహి యుండె.

"ఇతని జనకునిఁగూర్చి మీరెఱుఁగరేని,
తెలిపెద వినుండు; మధుపాన మలిన హృదయుఁ
డగుచు, దన్ను నెదిరిఁ గూడ నరయలేక,
నయ విహీనత మతిమాలి, భయమునీఁగి,
లజ్జ దిగనాడి, రిత్తమేలంబు లాడి,
పాటకుల కీయవలసిన పైకమెల్ల
విజయనగరంబు చెల్లింప విధి యటంచు

ముక్కు నంపిన వాఁడు మామూదు సుమ్ము.
(అపఁగా నేమి యాయె, కైపణఁగిపోయె;
చల ముడిగిపోయె; గర్వంబు సమసిపోయె;
తుదకు రాయలసంఖ్యంబె దొడ్డదాయె.)

"అట్టివానికి జనియించినట్టి యితఁడు
మిట్టిపడుచు, పడుచు చేష్ట లుట్టిపడఁగ,
సాహసంబునఁ దత్పూర్వపక్ష్యమెల్ల
మంటఁ గలియఁగ, రాయల మఱల నూఁపె,
ఊఁపి, యూపిరిఁ గొల్పోవ నుండెఁ గాని
బొమిడికం బొందు కాచె నా బోడితలను.

లేకయుండిన!...శత్రులమూఁక కెల్ల
మి త్తియన, నెత్తు రేఱులై మించిపాఱ,
చండ కరవాల ఖండిత శత్రుఁ డగుచు
రాయ లత్యుగ్రుఁడై రణరంగమందు
లోకభీకర గతినుండ ... దాఁకలేక
ఛత్ర మిటదాఁచి, యటవైచి చామరంబు,
బ్రదికియుండిన మనవచ్చు బలుసుకూర,
ననుచుఁ బరుగిడునాఁడు, నాయకుఁ డొకండు
వేచి, తటిసూచి, వేసిన వ్రేటుతోడ

శిరము వే వ్రక్కలై నేల దొరల కున్నె?
ఈ ముజాహిదు పేరంతరింప కున్నె?
తప్పెఁ దప్పెను; విధి యన్యథా తలంచె;

మేన మూనాళ్ల ప్రాణము ల్మిగిలియుండె ;

... ... ...

"క్రోధ మగ్గలమై బలిఁ గోరుచుండె ;
చేయఁదగు యత్నములు వేయి చేసినాఁడు ;
పాప ! మేమిచేసిన'గాని ఫలములేదు.

"ఏడుప్రాకారములలోన నెసఁగు కోట
యిన్ని యత్నంబులను నీసడించుచుండె;
దేశభక్త్యైకచిత్తత ధీరచర్య
లసువుఁ గసవుగఁ జూచుచు నప్రమత్త
బుద్ధిఁ బోరాడ, మార్గంబు పుట్టకుండె ;
మొగలు సగమాయె ; క్రోధంబు మిగిలిపోయె ;
బలము తొలఁగెను ; చలమింకఁ జెలఁగుచుండె.

"ఎట్టకేలకు నొకగోడ మెట్టఁ జాలె,
నదియె యీయావరణ మంచు మది నెఱుఁగుఁడు.
అంత, "మ్లేచ్ఛుఁడు సొచ్చెనే యకట" యనుచు,
"ముష్కరంబగు నీ త్రాగుముచ్చు బలము
పావనికి నెగ్గుసేయఁగాఁ బోవునేమొ;
మొఱకు పగరకు మర్యాద లెఱుఁగరావు ;
దేశగౌరవం బేఁగిన దేహమేల?
లెండు, రం"డంచు, త్రుటిలోన దండవారు
నిండి, నాచుట్టు చలమూని యుండి;
రంత,
ద్రోహియగు నా ముజాహిదు షాహి తనదు

సేనతోఁడుత నన్నెట్టులైన ముట్టి
భంగపఱచినఁ జాలు నాపగ యణంగు
నన్నచందాన - చలపట్టి - నన్నుముట్టి
చుట్టునుండినవారలఁ గొట్టుచుండె.

"ఒక్కవంకను బన్నంబు, నొక్కవంక
మతవిరోధంబు, క్రోధంబు మఱొకవంక,
ముప్పిరిగొని తురుష్కులఁ బ్రోత్సహింపఁ,
బ్రాణముల నాస యింక లేదంచుఁ బెనఁగి
తురక లొక్కట కరకులై పరగి ... రిచట,
విమత విద్వేషమును, మతావేశ, మాంధ్ర
దేశభక్తి, పారులకు నుద్రేకమిచ్చె;
నఱకుఁ డింకేల జాలంబు నఱకుఁ డనుచు
నార్చి, పైఁబడుచేగాని, యాంధ్రులయెయ్యో!

'శిక్షితులుఁజూడఁ దురకలు ; చేత మనము
పట్టి యెఱుఁగము కత్తిని ; బవరమునకు
సాహసించుట తగ' దని సైన్యమునకు
వార్తఁ బంపఁగవలె నన్నవారు లేరు.
తురకలన గడ్డిపోఁచలన్ కరణి నాంధ్రు
లెంచి వారలసంఖ్యమే లెంచరైరి.
పెక్కురణముల నవలీల నుక్కడించి
వారి నోడించుటను గాంచినారు గాన,

తురక లన్నను తృణములై తోఁచి రపుడు.
తెగల దీన్‌మవులా దీనుదీ నటంచు

జేయ్ మహాంజనేయా జేయిజేయటంచు,
రోదసీ కుహరంబెల్ల మ్రోఁగుచుండ,
ఘోరలీలల జరిగె నాపోరు ఘడియ.

"ఒక్కఁడొక్కఁడు పదుగురి లెక్క మ్లేచ్ఛ
భటులఁ జంపుచు దేశీయభక్తిఁ జూపి,
స్వర్గసామ్రాజ్య మందంగఁ జనిరి విప్రు ;
"లంత నీవార్త నెఱిఁగి సాయంబుసేయ
నరుగుదెంచెడు నాంధ్రసైన్యంబు గాంచి,
'ఇఁకఁ బ్రాణంబుతోఁ బోవు టెచట' యనుచు,
షాహి యొకకొంత చింతించి, సరభసమున
వారువము డిగ్గ నుఱికి, కుఠారమెత్తి,
నన్ను మొత్తంగ—క్రోధంబు మిన్నుముట్ట,
కటము లదురంగ, విస్ఫులింగములు చెదర,
పండ్లు పటపటఁ గొఱుకుచు-వచ్చుచుండె.
"అంతఁ నట సొమ్మసిలియుండు నట్టివాఁడు.
వృద్ధవిప్రుఁ డొకఁడు నివారింపఁ బూని,
నడుమఁ జనుదెంచి, "ఆగడు; నీ వడుగు, మిట్టి
పొలఁతి తన మేల విగ్రహంబులనుగొట్ట?
కండక్రొవ్వున్న, నీసాటి దండిమగలఁ
దలపడగ రాదె ?" యనుచు డఁ, జెలఁగి వాని
నొక్క దెబ్బను గొట్టి, మఱొక్కసారి
యా కుఠారంబు పైకెత్తి, యాని, కొట్టె
నన్ను ; ఆ గాయమే యిది చిన్నికుట్టు,

వదనమునఁ గానవచ్చునేఁ, డదియెసుమ్ము.
"అవసరం బింతతోఁ దీఱె; నైన బాల,
యవలి వృత్తాంత మొక్కింత యాలకింపు;
మటుల నగ్గొట్టగా విప్రుఁడలిగి - తనదు
బలమునంతయు గూర్చియు నిలువలేక,
బడలి శ్రమతోడ మోచేతిపైని లేచి,
"ఓరి దుర్మార్గ, తుచ్ఛుఁడా, యోరిపాపి,
"నేఁడు నీవొనర్చిన పని కీడు గుడుప
"కుండఁ బోవునే? చూడు, నీయూరు మట్టు
"కుండ ప్రాణంబుఁ బాయుదు వుండు మూర్ఖ"
యనుచు నసువులఁ బాసె నాయనఘుఁ;

డటులె

యాంధ్రులకు నోడి పాఱుచు హైన్యవృత్తి
షాహి యిలు సేరకుండంగఁ జచ్చె ద్రోవ-
రణములోఁ గాదు, శత్రుకరమునఁ గాదు-
తన పటకుటీర మందున, తనదు చుట్ట
మైన దావూదుచే—నిట్టి యధమ మరణ
మర్హమే గాద చెనటియా నతని కిలను?"

... ... ...

అర్హమౌ నర్హమౌ నర్హమౌను భళిర!
రాజపుత్రోత్తముల శరీరంబులందు
గాననగు దెబ్బ యొక్కొక్క గాథఁ దెల్పఁ
జాలునని చాటి రల కరీచంద్ర పృధ్వి
భూమిపా లాదు; లామాట పొల్లొ నిజమొ

తెలిసికొన లేదు మార్గ మేదియును నేఁడు;
కవుల వాక్యంబు లన్నియు కల్ల లన్న
కల్లరుల నోరుమూయింప గతియు లేదు ;
చతు రతుర సంయోగ పక్షపాతు
లేమి యడిగిన సాధింప ఋజువు లేదు ;
ఐన నేమాయె? నిజ మెటు లగును కల్ల?

పురుషమూర్తికిఁ దగు నలంకరణ మన్న,
పుట్టముంగాదు, స్వర్ణవిభూషగాదు;
బూటకపు సొమ్ము లిట్టివి కోటియైన
యుద్ధభువిలోన, నిజదేశ ముద్ధరింప,
నరుల డీకొని, ప్రాణంబు సరకుసేయ
కతి భయంకర లీల పోరాడు నపుడు,
విమత కరవాలమున నైన వ్రేటుమచ్చ
కొక్కదానికిఁ జాల వేయుద్దిఁగనిన.
వీరు లిలఁ గోరు నా యలంకారము లివె
యంచు లోకంబు తెలుగఁ జాటించినావు,
అంజనీసుత, నిన్నెన్న నగునె మాకు ?
ఆంధ్రులకు నెల్ల నాదర్శ మైతి వీవు.

---

# రాగి డబ్బు

## (ద్వ్యర్థి రచన)

ఆనిబెసెంట్ రోజులు; ఆమె బోధనలతో భారతీయులు ఉత్తేజితులయి ఉన్నారు. 'దీపావళి వసూళ్ళు' జమచేసి, నాయకుల కందజేసేవారము. 1916 దీపావళి వచ్చింది. నేను విశాఖపట్టణములో గణితశాస్త్రోపాధ్యాయుడను. ఉత్సాహంతో ఉన్న కొందరు విద్యార్థులకు డబ్బాలిచ్చి వసూళ్లకు వెళ్ల మన్నాను. "బోణీ మీరే చెయ్యండి" అన్నా డొకడు. సరే అని, అన్ని డబ్బాలలోనూ కానులు (రాగిడబ్బులు) వేసి పంపించాను.

సాయంత్రం అయిదు గంటల వేళకు హిందూ రీడింగ్ రూమ్ మెట్లెక్కుతూ ఉండగా నా విద్యార్థులలో ఒకడు నా ముఖం దగ్గర డబ్బావాగిస్తూ "దీపావళి వసూళ్లు సార్" అన్నాడు. చాలా మంది చూస్తూఉన్నారు. మార్గదర్శకంగా ఉంటుందని, నవ్వుకుంటూ, జేబులో చెయ్యిపెట్టాను. ఒక్క "అర్ధణా" డబ్బు మాత్రం ఉంది. (ఈ అర్ధణాలన్నవి దాదాపు రూపాయి సైజులో ఉన్న రాగి నాణాలు. అవి ఈస్టు ఇండియా కంపెని వారి హయాములో నుంచీ వస్తూఉండేవి) ఆ అర్ధణా ఆ డబ్బాలో వేస్తూ, "చుట్టలకోసం ఉంచుకున్నా నబ్బాయీ" అని అన్నాను. అక్కడి నా స్నేహితు డొకడు "అంతకంటే మంచి పనికే వినియోగం అవుతూ ఉంది; సంతోషించు" అన్నాడు.

దానితో ఊహలు రేగాయి. ఎన్నింటికో ఉపయోగపడుతుండిన ఆ రాగిడబ్బు దేశసేవకు వినియోగపడుతూ ధన్యమయిందని అనుకున్నాను. ఇంగ్లీషులో "Autobiography of a Shilling" ఒక షిల్లింగ్ స్వీయచరిత్ర అని ఒక రచన ఉందని స్మరణకు వచ్చింది. మన మెందుకు ఈ రాగిడబ్బు స్వీయచరిత్ర వ్రాయకూడదు అనిపించింది.

తలనిండా ఈ యోచనే. ఇంగ్లీషులో లాగా, కేవలం, ఒక రాగి నాణెం స్వీయచరిత్ర రూపంగా వ్రాస్తే బాగానే ఉంటుంది. కాని,ఆ యథార్థ చరిత్రతో ఒక 'ఊహాయువకుని' జీవితంగూడ జోడించి వ్రాస్తే ఇంకా బాగుంటుంది కదా. యువకులను దేశసేవకు ఈవిధంగా పురికొల్పవచ్చును గదా. అనిబెసెంటు సందేశాన్ని దేశీయుల కందజేయడానికి వీలుంటుంది కదా! అప్పటికి మన గాంధీజీ ఇంకా మహాత్ముడు కాలేదు. భారతీయ రంగంలోనికి రాలేదు. ప్రభుత్వమువారి శిక్షాస్మృతి Penal Code కి చిక్కకుండా బ్రిటిషు పరిపాలనలోని మన కష్టాలను ప్రకటించవచ్చుగదా. ఆ పాలన నుంచి విమోచనం కలగాలనే "ఉండదు నీచసేవ........" అన్న పద్యము. ఆ పద్యములోని కోరికలను సమర్థించ డానికే 'రాగిడబ్బు'కు కొన్ని సన్నివేశాలు—కొంచెం అదనంగానే అనుకుంటాను - కల్పించవలసి వచ్చింది. మన్నించండి. అర్థాంతరం (ఒక యువకుని జీవితం) రాగిడబ్బులో ఇమిడ్చి వ్రాయాలని నిశ్చయించు కున్నాను. అర్థాంతరం అనగానే అర్థాంతరన్యాస అన్న అలంకారం జ్ఞాపకానికి వచ్చింది. సరే, సాధ్య మయి నంత వరకు ఈ పద్యాలలో అర్థాంతర న్యాసాలంకారం ఉంచాలని గూడం ప్రయత్నించాను. ఇన్ని అగచాట్లతో సాగిందీ రచన.

పెంచి పెద్దజేసి విద్యా బుదులు నేర్పినందుకు శరణాలయమువారి ఆజ్ఞలప్రకారముగ యువకుడు ప్రవర్తించవలె నన్న నియమమున్నట్లు భావించాలి.

# రాగి డబ్బు

శా పుట్టువు నా పెంపును
నో పాఠకులార ! యెదుట నుంచెద; రసముఁన్
గాపాడుచుఁ బఠియింపుఁడు;
నా పేరా? "రాగిడబ్బు" నమ్ముఁడు ; సెలవా ?

నాదు చరితంబు వ్రాసెద మీ దయయని
చదువువారల కొక నమస్కార మిడెదఁ ;
జదువనట్టి వారికొ ? - నమస్కారమె కద !
వింత యనినఁ, బ్రయుక్తార్థ భేద మదియె

ఒక్క వస్తు విచట నొప్పును గొప్పదై
యదియె కాంచు నచట నధిక దైన్య ;
మీ ప్రయోగ భేద మింపుగా నా చరి
తంబునందుఁ గాంచఁ దగును వినుఁడు.

స్వల్పజీవిత మగుట నర్థాంతరంబు[1]
పద్యములఁదోఁప నీరీతి వ్రాసినాఁడఁ ;
జదువువారల కింతైన సంతసంబు
గలిగినం జాలు పదివేలు గంటి శ్రమకు.

ఇంక నేను బ్రహ్మవర ప్రసాది నయినను గనిన [2] తల్లి
యం దుద్భవించిన తెఱం గెట్లంటేని,

---

1. మరొక విషయమూ అర్థాంతర న్యాసాలంకారమూ.
2. రాగి: "ప్రసాదినయినను, గనిన"(=గనియందు); యువ: "ప్రసాదినయి, నను గనిన తల్లియందు"

ఉన్నతిఁ గోలుపోయి, యెట
నో యొక మూలను లోఁగ్రశించి, తా
నెన్నియొ పాట్లుపొంది, మరి
యెన్నియొ కాఁకలఁ జెంది, పల్చనై
కన్నది నాదుతల్లి! స్వ సు
ఖమ్ముల నెమ్మొయి వమ్మొనర్చె నో
చిన్ని నినుంగుఁ గాంచ! నెటు
నెల్లును తల్లిఋణంబు దీర్పఁగాన్ ?

అంత విధి వశంబునం దల్లి గతింప, నా సుఖనివాసంబు
నందుండం జాలక యాత్మ ఖారంబున,

తల్లిని, నన్నుఁగాంచ బెడి
దంబగు కష్టము లందినట్టి యాం
తల్లిని, బుగ్గిసేసి, ఎల
దాఁచుకొనం దగు తావులేక, నా
యుల్లమునం దలంచితి "బ
హు శ్రమలం బ్రతుకంగ వచ్చె ; మే
నల్ల కుదించి చెంబుగొని
యాచనకేఁగుటో, వంటపాత్రలం
దెల్లపు డుండి మాఁడుటయొ,
యిండ్లకు నీళుల మోయుటొక్కొ; నా
వల్ల మరేమి కాఁగలదు
బాపురె! రేపటినుండి" యూహకే

చిల్లులు వోపు మానస మి
సీ! పితృహీనుల దేమి జన్మమో !
అంచు నొక కొట్టుమూల దుఃఖించుచుండ
నొక్క ధన్యుఁడు నను గొని, ప్రక్కనున్న
యొక్క యక్షరశాలలో[3] నొప్పఁజెప్పి,
తనదు దారినిఁ బోయె ; నాతని నెఱుంగ.

* *

అట్టిశాలను నాకు నా లక్కరంబు
లబ్బె ననుటకు సంతోష మగును గాని,
శిక్షఁ దలఁచిన నిపుడును జెమట పుట్టు :
నెక్కుడని తోఁచ ముక్కలు చెక్కివైచి,
యేగతిని లోపముండిన సాఁగదీసి,
పట్టి పటుకార్ల, నెత్తిని గొట్టి, తట్టి,
పలుకు మనినంత కంగని పలుకునట్లు
చేసి విడిచెద, రది వారి శిక్ష తెఱఁగు ;
అటులఁ గాకున్న నబ్బునే యక్షరములు ?

అబ్బె న్నాల్గయి దక్కరా లిఁకనునే
హాయి న్మన న్వచ్చు నే
యిబ్బంద ల్గనకుండ నంచు మది నూ
హింపంగ, నొక్కింతలోఁ
దబ్బిబ్బై యొక విప్రునింటి కరుగన్
నన్దోలి రేమందు ? నా !

3. టంకసాల - ఏదో మిషన్ వారి అనాథశరణాలయ పాఠశాల.

నుబ్బం జెల్లదు కోర్కుల న్నరు; లదే
యఁ బన్నాఁడు తత్కర్త పైన్.

అట్టుల నాయకక్కరంబుల మూలంబున స్వాతంత్ర్యంబుం గోలుపోయి 4 నేనేఁగిన బ్రాహ్మణుండెట్టి వాఁడనిన :

పారుని వర్ణింపఁగ నే
నేర; నతని దొక విచిత్రనీతి గలదు; తా
నేరికి నొకతృణ మీయఁడు;
కోరఁడు తన కొక్కసుఖముఁ; గూర్చుధనంబున్.

ఒకపనిఁ జేయఁగాఁ బనుపఁ;
దూరక గుడ్డలఁగట్టి యూపి రిం
చుక సలుపంగ నీయ కొక
చో నను బెట్టి బిగించు వాఁకిలిన్;
పకపకనవ్వు నన్నుఁ గని;
పాపము! చచ్చెడి వేళఁగూడ
నూరక కరమందు నన్నుఁగొని
ప్రాణముఁ బాసెను: లోభి చావిదే.

లోభి గతింప నొక్కత్రుటి
లోపల నన్ను వెలార్చి తత్సుతుం
డీభవనంబుఁ బాపె నొక
హీనకులాంగన సేవసేయ, నా

4. అనాధశరణాలయం వారి ఆజ్ఞలకు బద్ధుడయి ఉండాలి.

హా ! భగవంతుసృష్టిఁ గన
నచ్చెరువౌఁగద ! ముద్దు కింతయా?
లోభి సమస్త భాగ్యములు
లోకుల పాలను టిద్దియే సుమా.

తనువుమఱవఁ ద్రాగి దాసి నన్ దోలెను,
కల్లునమ్ము వానికడకు మనఁగ;
నిట్టులుండుఁ గాదె యెప్పుడు స్వాతంత్ర్య
హీననరుని బ్రదుకు ; మానహాని!

ఇంక నాపాటు లేమని వర్ణింపఁ జాలుదును ?

సారాయి కంపున శ్వాసము ల్బిగియించి
కూర్చుండి యుంటినేఁ గొన్నినాళ్లు,
చింతపండున మేనుచిక్కి రూపంబెల్ల
మన్నుగా నుంటి నేఁ గొన్నినాళ్లు,
బెల్లంబు మోయుచు నల్ల చీమలు గుట్ట
కొట్టుల నుంటి నేఁ గొన్ని నాళ్లు,
చమురులోఁ బడి శరీరము స్మ్రశింపఁగ రాక
ఖిన్నత నుంటి నేఁ గొన్నినాళ్లు,

అదియు నిదియును నననేల, యంటరాని
వస్తువులఁగూడఁ బడియుంటి వాసిదఱిఁగి.
యెందు నుండిన ననుభవం బింత లేదు :
దర్వి యెఱుఁగునె రుచుల చందంబు లిలను ?

ఇన్ని కష్టంబు లందుచునున్న, నడుమ
నడుమ నొక కొన్ని సౌఖ్యముల్ వడయుచుంటి
ధనిక పుత్రుల ప్రాపున మనుటచేత.
మెత్తనగు పొత్తికలఁ బడి మెలఁగియుంటి,
మోదకంబుల రుచులందు మురిసియుంటి,
నత్తరువులందు పరిమళం బరయుచుంటి,
చిత్రములఁ గాంచి సౌఖ్యంబుఁ జెందుచుంటి,
హృద్యగానంబులను బ్రమోదించి యుంటి;
నిన్ని యా యంచు మీరు నన్నెంచఁ బోకుఁ;
డింద్రియంబుల కోరిక లెపుడు దఱుఁగు ?
ప్రభుల దయయున్నఁ గోర్కెలు ఫలముఁ గనవె ?

ఇన్నిఁటిఁ గంటి నంచు వచి
యించుచు నుంటిని సిగ్గులేక, నే
మొన్ననె యొక్క పేద నడు
మున్ గడు బత్తినిఁ బట్టి పట్టి చే
సన్న[5] మెలంగియుంటి నను
జ్ఞాపక మైనను లేకపోయె, నా!
నెన్నఁడు బన్నముల్ దలఁచు
నే నరుఁ, డెంచునుగాక ప్రజ్ఞలన్.

అదె యన నేల? యొక్క సమ
యంబున నే నొక కల్లుముచ్చుతో

5. పేద—మొలనుంచిన డబ్బు జారిపోతూందేమో అని తడుము కుంటూ ఉంటాడు.

మదిచెడి పోవ బాట నడు
　　మన్ బడి పొర్లుచునుండ మార్గగుల్
పద పరితాడనంబులఁ గ
　　లంచినదే మఱవంగఁ జాలితిన్.
బ్రదుకఁ గలండె యొందు నన
　　మానము నెంచెడి గర్వి యుర్వరన్?

అతి దుష్టాత్ములఁగూడి, క్రౌర్యముల నె
　　న్నైనం దగం జేయుచున్
వెత రొక్కింతయుఁ గాంచలేక వ్యసన
　　ప్రీతాత్ముల న్మంటి, సం
గతు లింకేటికి ? చెట్ట నాఁ బఱగు నే
　　కార్యంబును న్మానలే ;
దతి దోషాస్పద మీఁగఁజాలు నెటు భ్ర
　　ష్టాత్ముండు సంపర్కమున్?

దైన్యవృత్తి నింక దైవంబె దిక్కంచు
నేమి సేయ ననుచు నీడ్చుచుండ,
బాలకులకు దైవవశమున వశమైతి
నంత "చింతపాసె హాయిబ్రదుకు
జీవుఁడా" యటంచు చింతించుచున్న నఁ
పట్టికొట్టె నొకఁడు పండ్లు దేర;
మరల నొకనిఁజేర మఱి యేదొ తెప్పింపఁ
ద్రిప్పిచంపి; రిదియె తెఱఁగునాకు.

చెప్పనేల యొకఁడు సిగరెట్లు దెమ్మంచు,
పొడుము దెమ్మటంచు, విడె మటంచు,
చెడ్డవస్తువులకుఁ జిలుదిండికొఱకు నన్
బట్టి తోలుచుండి; రెట్టిగతియొ!
యొక్కచోట గడియ యుండ నోఁచఁగలేదు;
హాయిగలదె సేవకాళికెచట ?

ఇఁక, పరతంత్ర జీవన
సంకటములు దెలుపవలెనె ? చాలవె ? బలమున్
బింకము సెడు, జీవన మా
తంకంబుల నిండుఁ, దొలఁగు ధైర్యం బవలన్.

అంతం గొన్ని దినంబు లేఁగఁ దొలిఁ బు
ణ్యంబేమి నేఁ జేసి నా
స్వాంతంబందున నీకు నిల్పితినొ! త
న్వంగీ లలామం[6] బొక
ర్తెంతే సంతసమొప్ప నన్నుఁగొని, నా
కే కార్య మింపౌనొయన్
చింతం దాల్చెను; స్త్రీలు గారె కరుణా
సింధుల్ మనం బున్నచోన్.

ఇంతలో మనదేశంబున్న తెలుంగెఱుంగం దలంచితేని,
చదువరి సావధానము! వి
శాల యశోరమణీయ పూర్వ సం

6. అనిబెసెంట్ అందామా?

పదఁ దులదూఁగుచుండు మన
భారతమాత యిదేల యిట్లు డా
పదల మునింగి, దుష్టపరి
వర్తననుంటి? తదార్తిఁ బాపి స
మ్ముద మొదవంగఁ జేయ నున
మున్ ధనముల్ సుఖముల్ దృణ బుగా
మదిఁ దలపోసి సేవలను
మాతృభువిం దనియించు బుద్ధి పో
లదె? యని ధీరభావన బ
లంబునఁ గొందఱు స్వీయచింతలన్
మొదలు తెగంగఁ గోసి, యశ
ముం గనుచుండు నమోఘ భాగ్యమౌ
నద నగుటం, గుతూహల మ
నంతముగాఁ బ్రజలందుఁ బర్వఁ, దా
మదిమొద లాత్మ దేశమున
కై పలుసేవలు సేయఁగా బరం
గుదు; రదెపో! మహాత్ముల య
కుంఠితవర్తన ప్రోత్సహింపదే?

అట్టు లుత్సాహ సంపూరి తాత్ములైన
కొంద ఱొకనాఁడు నాబోఁటు[7] లెందునైన
దేశమాతను సేవింపఁ దీరు గలిగి
యున్నచోఁ గూర్చు నూహ మాయూరు చేరి,

---

7. డబ్బులూ యువకులూ అని.

యత్నములు సేయ, నన్బట్టినట్టి కాంత
వారి సముఖంబు నల్లనచేరె. వారు
"భారతీయులార ! వేరందు, వేరందు
మాతృసేవ కిదియె మంచిసమయ ;
మిన్నినాళ్ళు మనకు నెన్ని యోవిధముల
మేలుసేసినట్టి మెలఁతమిన్న,
పుట్టి యెఱుఁగనట్టి చెట్టలఁ గాంచుచు
మిగుల దైన్యవృత్తి వగచుచున్న ;
దిట్టి యెడలఁ గాక యెప్పుడు కొమరులఁ
గనినఫలము గాంచుఁ గన్నతల్లి ?
"అంతియేకాదు, మనదేహమంత యెవరి ;
చిన్ననాళులు మన మారగించుచున్న
వస్తు సముదాయ మెవరిది ; బ్రమకుసర్వ
మెవరి ; దట్టి భారతభూమి యెగ్గు లంద,
నాదుదేశంబునకు సేవ నావిధి యన
కుండునే యొక్కఁడును బాలిశుండు దక్క;
తనకుఁగల్గిన సర్వంబుఁదల్లి దనుచుఁ
దలఁపఁడే యొక్కఁడును వట్టి తులువ తక్క.
"రెండు దేహంబులం దున్న కండబలిమి
వశమునం దున్న ద్రవ్యంబు భరతమాతృ
దివ్యసేవకై యర్పింపఁ దెగువగలిగి
కంకణము గట్టుఁ డింక నే శంకవలద"
టంచు మాతృసేవైకపరాత్ము లగుచు

శ్రోతలకుఁగూడ కుతుక ముద్భూతమైన
తెఱఁగునం జెప్ప, వేవేగ తెలుపమిన్న
నన్నుఁబ్రోత్సహించుఁ దోలెఁ బ్రసన్నమతిని;
కాంత యెటు లోర్చునో వియోగంబు నెఱుఁగ;
జన్మభూమికి స్వర్గంబు సాల దనెడి
తలఁపు గలవారి కిది యద్భుతంబుగాదు;
స్వీయచింతల దేశంబు వృద్ధి యగునె?

ఈ వియోగంబున కెంతయో చింతించి యీడిగిలం బడి[8]నే నాయరం బ్రవేశించినంత, నాహా! యేమని వ్రాయఁజాలుదును!

"ఉండదు నీచసేవ, యిఁక
నుండదు దుర్భరపాలనా భయం,
బుండదు దోషవర్తనము,
నుండ దిఁకే వ్యసనంబు, నింతయే
నుండదు సత్యవృత్తి కదు,
రుండదు చిత్తమునందు వ్యాకులం,
బుండ దిఁకెట్టి పాపము నో,
హో! యిఁక జన్మము ధన్యమేకదా"!

అని రోదసీకుహరంబెల్ల నిండినట్లు లోపలినుండి యొక్క గంభీర మనోహర స్వరంబు వీనులం జొచ్చి మానసంబు నానందంబునఁ దేల్చివైచుచుండె.

8. ఇరుకు చీలిక ద్వారా డబ్బాలో పడి

సాయం వర్షానంతర
గేయ మహాప్రకృతి సదృశ కిల్బిషదూర
స్థాయంబై, చిత్తం బిదె
హాయిం గడు చల్లనగుచు నాడెడుఁ గంటే.

కాన! మహాత్ములార! ధని
క స్థితులార! గృహస్థులార! యెం
దైనను మాదృశుల్ తమ క
టాక్షముల న్మని యున్న, సర్వస
మ్మానితవృత్తి నీ భరత
మాతకు సేవ యొనర్పఁ బంచి, దే
శానకు మీకు మాకును య
శం బెసఁగంగ, మదీయు లెల్లరున్
పూని స్వదేశ వృత్తులన
ముద్దులు గుల్క, మెలంగ నిండు, సం
ధానము సేయుఁ డాగతము,
ధర్మ మవశ్యము సేయుఁ; డింతియే
కాని, మహార్తితో చెనటి
కార్యములం బడి పొర్లనీకుఁ, డా
హీన పథంబులెల్ల నశి
యింపఁగఁ జేయుఁడు, దేశసేవ యం

దే నడిపింపుఁడీ మము, ప
యిన్ మము బోంటు లొసంగు మేలు
నూనుఁడు; ... గొప్పకాదు, కృత
మూరక విస్మరియించి నార కా
నూన విశేష ఘోరగతి
నొందఁ గృతఘ్నులమై చెలంగ మా
చే నదిగాదు. మీరు నిది
చిత్తములందునఁ బాదుకొల్ప మీ
కౌను జయంబు, విశ్వమున
ఖ్యాతి గడింతురు, నమ్ముఁడయ్య; యిం
కేను సమాప్తి చేసెద మ
దీయ చరిత్రము, దోసి లొగ్గుచున్.

# దాంపత్యము - శృంగారము

(సాంఘిక విషయ రచన)

కాకినాడలోనో, రాజమండ్రిలోనో, మిత్రుల గోష్ఠిలో శృంగార రసం గురించి ప్రసంగం వచ్చింది. మనకవు లందరూ ఆ రసాన్ని వివాహానికి ముందూ, వియోగం వచ్చిన తరువాత మాత్రమే సరసంగా ఉపయోగించా రనీ, అసలు దాంపత్యంలో ఆ శ్రద్ధ వారు తీసుకోలేదనీ అనుకుంటున్నాము. కొందరు "దంపతులయిన తరువాతశృంగారరస జీవనము ఇంకేముంటుంది? పడకలతోనూ కొడుకులతోనూ సంసారం గడపడమే కదా రసం—శృంగా రమో వికారమో" అని గేలిచేయడానికి పూనుకున్నారు. కాలాతీత మయిందని, వాదన ముగించుకొని బసలకు పోయాము.

కాని, నా తలలో ఆ విషయం మెలగుతూనే ఉంది. పెళ్లికి ముందూ వియోగంలోనూ వున్న శృంగారం కంటే దాంపత్యం లోని శృంగారం భిన్నంగా, చాల సున్నితంగా, మారు రూపుతో ఉంటుందని నా అభి ప్రాయము.

ఆ అభిప్రాయాన్ని నిరూపించాలంటే, కొన్ని అనుభవాలనూ సన్ని వేశాలనూ చెప్పాలి కదా. భార్యాభర్తల ప్రత్యేకాలోచనలతో రుజువు చేయాలి కదా.

అలా అని, ఏవేవో కొన్ని సన్నివేశాలూ కొన్ని అనుభవాలూ కల్పించి వ్రాయడం సరియైన పనికాదని నా యుద్దేశము. ఉత్తుత్త కల్పనలతో సాధించినది గూడా ఉత్తుత్త రసమే అవుతుంది. కాబట్టి, జరిగిన సంఘటన లనే చెప్పడం న్యాయ మనిపించింది. ఆ ఆలోచనతోనే దీనిని భార్యాభర్తల ప్రసంగ రూపంగా వ్రాయా లనుకున్నాను.

ఎవరో ఇతర భార్యా భర్తలకు సంబంధించిన విషయాలు నేను వ్రాస్తే ఎవ రూరుకుంటారు? నాకా అధికార మెక్కడిది? అంతేకాక, సత్య విషయాలపైనే దృష్టి నుంచాను కాబట్టి, మా దంపతి జీవనంలోని సన్ని వేశాల మీదనే ఆధారపడక తప్పింది కాదు. అందువల్ల దీనిలో స్వీయచరిత్ర లక్షణాలు కనిపించక తీరవు. సహృదయులు వాటిని అప్రధానంగానే చూస్తారని నమ్ముతున్నాను.

కలిమిలేములలోనూ, సుఖదుఃఖాలలోనూ, ఆధి వ్యాధులలోనూ దంపతి జీవితములో శృంగార రసము చాల సున్నితం, కాబట్టే ఎక్కువ హృదయంగమంగా, గోచరిస్తుంటుంది. ఆయా సందర్భాలలో భార్యా భర్తల చేష్టలు స్థూల దృష్టికి సామాన్యంగానే కనబడతాయి. అందు చేతనే, దాంపత్యములో శృంగార రసములేదన్న అభిప్రాయం కలిగింది. కాని, భావజ్ఞులైన వారికా చేష్టలు ఉదారభావాలను ప్రకటించి సీతారాముల ప్రణయ ప్రవర్తన వలెనే, వారిని ముగ్ధులను చేస్తాయి.

కావలసినంత శృంగారరసము దాంపత్య జీవితములో ఉంది. అసలే కష్టభరితంగానూ నిస్సారంగానూ ఉన్న ఈనాటి సమాజ జీవనములో, కొంతకు కొంత సౌభాగ్యానుభవానికి అవకాశాన్నిచ్చే దాంపత్య స్థితిని మరింత నిస్సారంగా నిరూపించే అభిప్రాయం తగదు. జీవితంలో శృంగార రసప్రసక్తి లేదనుకొని భార్యా భర్త లెవ్వరును పై చూపులకు పోనక్కర లేదని మనవి చేయడానికే ఈ (1928)రచన.



## దాంపత్యము - శృంగారము

భర్త

ప్రేయసి, రమ్మ్ము రమ్మ్ము, విప
రీతపు వార్తలఁ జూడు మెవ్వరో
వ్రాయఁ గడంగినా; రిదిగొ
పత్రిక; బాగుగఁజూడు; మే మనం
బోయెద ? విన్నినాళ్ళు మన
మున్గిన దాది రస ప్రవాహమూ,
స్వీయ విమోహ కల్పిత వి
చిత్ర వికారము లెండమావులా ?

భార్య
(చదువు చుండును)

భర్త

విప్రయోగంబు నందును బెండ్లి ముందు
మాత్రమే కల్గు శృంగార మాన్యరసము
గానఁ బెండ్లితోఁ దీఱు శృంగార మంట!
దంపతుల కాదిరస జీవితం బికేది ?

భార్య

పోనిం, డేమొ మహాప్రమాదమని యీ
బూమెల్ వితర్కింపఁగా
నేనా ? వే ననుఁ బిల్చి; రా రసము పెం
డ్లిం దీఱు నున్మాదమా ?

మౌనివ్రాత నుత ప్రచారమగు దాం
పత్యంబు నిస్సారమా ?
శ్రీనాథాదుల కావ్యదంపతులలో
శృంగారముం జూడమా ?
(అని పోఁబోవును)

భర్త

నిరసించినఁ బని తీఱునె
తరుణీ? మనకవులు పెండ్లి దనుకను, దూరం
బరిగిన వెనుకను గాదే,
విరచించిరి తద్రసంబు విపులముగాఁగన్.

" పెండిలి నాఁటి నుండియుఁ బ
విత్ర గృహస్థ విశేష ధర్మ బ
ద్ధుఁడయి పూనఁగావలెఁ జ
తుర్విధ సత్పురుషార్థ దీక్ష నె
వ్వాఁడు " నటంచుఁ దెల్పి నిటు
వ్రాసిరి గాని, రస ప్రసక్తి లే
కుండుటఁ గాదు; లేదు నవి
యోగము నందు రసాహితత్వమున్.

భార్య

అలుసు జెన్మిటుం చనిన యంత
విలాస రసంబు లింకఁగా
నేల? సుధాంశు కాంతిఁ గల
యింపు లయించునో, సాంధ్యరాగపున్

లీలలు మాయమౌనొ, రమ
ణీయ వసంతము రాదొ, వేడుకం
గ్రాలుచు యౌవ నోష్ణ రుధి
రంబు శరీరము లందుఁ బర్వదో!

భర్త

కలగొను ప్రేమ కైవసము
గామిఁ దదీయ వచః కటాక్ష సం
చలన వికార దర్శన వి
చారము - దూరము బాసియుండు గా
దిలి తొలిచేయు కూర్మివెను
దియ్యని నెయ్యపుఁ జెయ్వు లెంచి చిం
తిలుటయునున్ - రసంబయిన,
నింద్యమొ? తత్ఫల హేతు వర్తనల్ ?

భార్య

తొలి మీచూపులు మాటలుం గుణము సం
తోషంబుతోఁ జూచి, నా
కు లభించుంగద యివ్వి సర్వమని కో
ర్కుల్ దీఁగలై సాఁగ, డో
లల నూఁ గాడితి; నిప్పు డవ్వి గని, వా
ల్లభ్యాప్తి వైమానికో
జ్జ్వల యానంబున సంచరింతుఁ బరితో
ష వ్యోమ మార్గంబులన్.

భర్త

దూరము విప్ప కే నతి కు
తూహలతం జనఁబోవు నప్పు, డా
ద్వారము చెంత నిల్చి, వెలి
వార లెఱుంగుదురో యంచు, సూరుక
న్నీరు దొలంగ నీయమిఁ, గ
నీనికలన్ సుడివెట్టుచు డ, శృం
గారపుఁ బూల తోరణము
గట్టవె నీ వసితోత్పలంబులన్ ?

భార్య

బాంధ వాదరణంబున, భర్తృభక్తి,
నార్త పోషణ, సకల విద్యానురక్తి
'నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి'
యనుట విను వేళ మీదృష్టి కర్థమేమి ?

భర్త

నాదు గుణమును, కవన సన్మాన గరిమ,
నేఁ బరీక్షులఁ బ్రస్తుతి న్నెగడుటయును
జనము గొండాడ, నీవు నన్గనెడు చిన్ని
యదటు చూపుల కెల్ల వ్యాఖ్యాన మద్ది.

భార్య

అనుచు మనమాడుకొను మాట విని విమర్శ
చేయఁగలవారు గల్గిన, వేయు నేల ?
సరస శృంగారరస విలాసములఁ దేల
దంపతుల లీల సొంపుల నింప దేల

భర్త

శృంగా రాకృతి నీవ నిల్చుట, రసో
ద్రేకంబుతో నేను వ్రా
యఁ, గారామునఁ జూచి, పద్యములలో
నాత్మానుభూ తార్థ మొం
డు గా నుండుట, నీదు చూపు, త్రపయున్,
మోదంబు కోపంబు నై,
శృంగా రార్ణవ వీచికోదయములన్
చీకొట్టదే, వాకొనన్ ?

భార్య

అలనాఁ డట్టులు కాలిబాధను వితా
కై యుండు నాదండ మీ
రలు బాధోపశమ ప్రయత్న సువిచా
రం బందఁగాఁ జూచి, చిం
తిలు నన్నుంగను మీ కటాక్ష విలస
న్నిర్నిద్ర రాగ ప్రభల్
కలవా, కాగడపట్టి చూచినను శృం
గార ప్రపంచంబునన్ ?

భర్త

"ముక్కు మొగంబు మీవె మన
ముద్దుల పట్టికి; "..." దేహకాంతులి
వ్వేక్కడఁ గల్గె ?" ..." మీ రెఱుఁగ;
రెప్పుడు నా యెదఁ బాయకుండు మీ

యక్క మనీయకాంతి సము
దగ్రత సుం" డని పల్కువేళ నీ
చెక్కులఁ జిందులాడు కళ
శిక్ష యొనర్చు రసాతిరేకమున్.

భార్య

చిన్ని నిసుంగు మోహనునిఁ
జెంత పడంతికిఁ జూపు భాగ్య మి
ట్లిన్ని దినాల కబ్బెనని
యేమొ, మహా ముదమంది చెక్కలన్
మిన్ననఁ దేలుచుండు నను
మీ రటు దూరమునుండి చూచు నా
సన్నని చూపులోఁ గులుకు
చందము గందు మె యెందు నెన్నఁడేన్ ?

భర్త

"శ్రీరంగేశు భజించి, తా తిరుపతిన్
శ్రీనాథు సేవించి, తా
పూరిన్, గంచిని గంటి, సేతువున నో
ముల్ పట్టి తే కోర్కతో
నారీ, నీ" వన, "నేమొ పొం" డను విధా
నంబందుఁ గాన్పించు శృం
గారార్థంబును విప్పిచెప్పిన మహా
కావ్యంబు గాకుండునే ?

భార్య

దైవకృపా విశేషమున
ద్రవ్యము సర్వము వోవునాఁడు, నా
కేవగఁ దోఁప నీయక మ
దేకనిబద్ధ విలోచనంబులన్
రేవగ లొక్కరీతిఁ గరు
ణించి, "బలా! యవకాశ మబ్బె నీ
కీ విధిఁ బ్రేమఁ జూపితని
యింపఁగ" నంట యదే రసంబొకో?

భర్త

ఇరువుర మే ప్రబంధమొ ప
ఠింపఁగ, నందలి యా విలాస వై
ఖరులు నిజాను భుక్తముల
కన్న ఘనంబులొ కావొ యంచు లో
నరయుచు నుండు నీ శిరము నందలి
కంపము, కంటిచూపు, సుం
దర ముఖకాంతియుం దరుణి,
తాండవలీల రసాధినేతకున్.

భార్య

బుడుత మొగంబు వెన్నెలల
ముద్దిడునంత, నొక శ్లోకశ్ల కె
క్కుడు రుచిరాంగులై తెలియఁ
గూరిమి నాలుమగల్ ముదంబుతో

నడరెన యప్పు డా ముఖము
లందరి లేనగు తేట చాలదే,
వెడఁగు ప్రబంధ వర్ణనల
వేయిని చీయని తూలనాడఁగన్ ?



# ఘంటా న్యాయము

(ప్రయోగాత్మక రచన)

1913 ప్రాంతంలో స్కూలుఫైనల్ విద్యార్థులకు తెలుగు రెండవ పరీక్షాపత్రము (వ్యాసరచన) ఇవ్వవలసిన పని నాకు బరంపురము, కల్లికోట కాలేజీలో కలిగింది. అప్పటి విశ్వవిద్యాలయ పరీక్షలలోను, స్కూలు ఫైనల్ పరీక్షలలోను, ఒక అలవాటు ఉండేది. ఇంగ్లీషు వ్యాసరచన పత్రములో కావ్య ఖండములుగాని, పద్య కథలు గాని ఇచ్చి, వాటి సారము తమ మాటలలో వ్రాయమనే వారు. ఆ పద్ధతినే ఈ తెలుగు పరీక్షలో కూడా చేస్తే బాగుండునుగదా అని మన కావ్యాలు కొంత వెదికాను. ఆ అంతస్థు విద్యార్థులు తమంతట తాము అర్థము చేసుకోడానికి తగినంత సులభశైలిలో ఘట్టములు చాల అరుదు—సుదీర్ఘాలు గూడాను. ఇంగ్లీషులో "పద్య కథలు-Story Poems" అన్న పేరుతో సంపుటాలు ప్రచురణ జరుగు తుండేది. మన మెందుకు చిన్న చిన్న కథలు, సులభశైలిలో పద్య రూపంగా వ్రాయకూడదు అని నేనూ మా కాలేజీ తెలుగు పండితులూ పూనుకొని కొన్నిటిని వ్రాసి, విద్యార్థులకు వ్యాసరచనలో శిక్షణ నిస్తూండే వారము.

ఈ పనికి బాగా ఉపకరించినవి ద్విపద, ఆటవెలది, తేటగీతలు అని వేరుగ చెప్పనక్కరలేదు. ఎంత చక్కగ వ్రాసినా, ఈ పద్యకథలు చదివి నప్పుడు కొంత రోకలిపాటగా విసుగు కలిగించక తప్పవు. ఇంగ్లీషులో పెద్ద పెద్ద గ్రంథాలు 'బ్లాంకు వెర్స్' Blank verse లో వ్రాస్తూ కవులు మధ్య మధ్యను(అయాంబిక్ ట్రొకేయిక్ మార్పుల ద్వారా) గతి మారుస్తూ ఉండడంవల్ల అంతగా విసుగు కనిపించదు. ఆ పద్ధతినే అవలంబించి, నేను కథా సందర్భాన్ని పట్టి ఆటవెలది నడక నుంచి తేటగీత నడకకూ, దీనినుంచి దానికీ మార్చి, చిత్రగీత మాలికలను ప్రయోగాత్మకంగా వ్రాసి, మా రచయితలకు చూపించాను.

ఇంతలో Bell of Atri (బెల్ ఆఫ్ అత్రి) అని ఒక ఆంగ్ల పద్యకథ నా కంటపడ్డది. మనదేశ అనంగపాలుడిని గురించి అటువంటి కథ ఒక చరిత్ర కథల పుస్తకములో చదివాను. ఆరాజు కూడ న్యాయమన్నది ఒక్క మనుష్యులకే కాదు, పశులకు, జంతువులకు కూడా అందజేయాలని ఏర్పాటు చేశాడు.

కోలెరిడ్జి అన్న ఆంగ్లమహాకవి తన Ancient Mariner (ఏన్షెంట్ మేరినర్) లో గొంతెత్తి చాటిన సూత్రము :

He prayeth best who loveth best
Both man and bird and beast.

ఆ సూత్రానికి ఈ ఘంటాన్యాయము కథ వ్యాఖ్యాన రూపంగా ఉండగలదని గూడ ఆశించాను. కాబట్టి విద్యార్థుల పరీక్షల కొరకు కాకుండా, దీనిని ఆంధ్ర పాఠక మహాశయులకు అందజేయాలని కొంత దీర్ఘ రచనగానే 1917 వ సంవత్సరం ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురించాను.

ఇంగ్లీషులో లాగా పెద్ద గ్రంథ మేదయినా ఒక్క ఛందస్సులో వ్రాయాలంటే, ఇప్పటికీ ఈ సమస్య ఉంది. ద్విపదలూ, వృత్తమాలికలూ విసుగెత్తించక తప్పవు. అందుచేతనే మన అభ్యుదయ కవులు మాత్రా ఛందస్సును ఉపయోగిస్తున్నారు. దీని జయాపజయాలు పెద్ద రచనల మూలంగా ముందు ముందు తేలగలవు.



# ఘంటా న్యాయము

(చరిత్రాత్మక చిత్ర గీతమాలిక)

భరత వర్షంబునందున్న పురమతల్లి,
ఎన్నియో రాజ్యముల కెన్నఁ గన్నతల్లి,
రాణ నొప్పారు సౌందర్య రంగవల్లి,
నగరరాజ్యంబు ఢిల్లి, నెఱుఁగుదురు గద!

ఆపుర మ్మొంకఁ దురకల కాఁపురమ్ము
గాక పూర్వమె, దేశానఁగలుగు సొమ్ము
లెల్ల నితరుల చేతుల కేఁగకుండ
దేశభాషల కొఱకును, దేశవృత్తు
లకును, నుపయోగమై చాల లగ్గొనర్చు
కాలమందునఁ బాలించె ఘనుఁ డొకండు.
పే రనంగ పాలుఁడు; ప్రజఁ బిల్లలట్ల
చూచి, కాపాడు చుండుటఁ జూచి, పరులు
గూడ మెచ్చుచుండిరి. సిరితోడ జనులు
పలువితమ్ముల జ్ఞానంబు గలిగి మనిరి.

కలవు వానిగుణము లనేకములు: గొప్ప
రాజు దానని మదిని గర్వంబులేదు;
రాజగుట పెద్ద కార్యభారంబు దలను
దాల్పుటేగాని, రాజ్యంపు ధనము నెల్ల

వ్యయము సేయుచుఁ బ్రజలకు వంత నొసఁగ
గద్దె మీఁదను గూర్చుంట కాదటంచు
మదిని మఱవఁడు; తా నెంత మాన్యుఁడైనఁ,
బ్రజకు సేవ సేయంగ దైవంబు పనిచె
నంచుఁ జింతించు; దేశంబునందు భక్తి
గలిగి ప్రజలెల్ల దేశీయ గౌరవంబు
నిల్పికొనునట్టి బోధల సల్పుచుండు;
ఇంతియే కాదు న్యాయమం, దెంత పేద
యయిన, ధనికునితో సముఁడంచు నెంచు;
అట్టి రాజుండఁ బ్రజకు లేనట్టి దేది?
ఐనఁ, దనక్రింద నుద్యోగులైన వారి
కిట్టి సుగుణంబు లుండుట యెందు నరుదు
గాదె! అటనటఁ, బెను ముండ్లఁ కంపలట్లు,
రాజు చుట్టును నుద్యోగిరాజి యుండు
నేగదా! అటువంటి వారితని క్రింద
నుంటఁ గనిపెట్టెఁ దానెంత యుత్తముండో!
అటులఁ గని, హా యటంచు ననంగ పాలుఁ,
"డకట! చింత సేయ నధిపున కుద్యోగి
"గణమె కందె చెవియుఁ గన్ను నండ్రు;
"అవును, రెండు కనులు చెవులు రెండునుగల్గి
"యొరునిఁ బోలు నొక్క ధరణిపతికి

"వారితోడు లేక వశమె కోటి జనంబు
"గల తెలంగాణ నెటింగి వలను సేయ?
"వీరె న్యాయమునకు దూరులై వర్తింప
"జనుల కీడులెన్న శక్యమగునె?
"దోస మున్నచోట దూషణం బుండదు,
"నిరపరాధి కగును పరమబాధ;
"అర్థవిద్య బ్రదుక యాచనకే పూను,
"నలతి చదువు లెక్క నందలముల;
"సోమరుల్ ధనికులు సేమాన నుందురు,
"పంటకాపు చింత పాలఁ బడును;
"పేదవారు మరియుఁ బేదలై వర్తింత్రు,
"ధనికు నింటి ధనము గుణితమందు;
"పలుకు లిన్నియేల? పాపంబు ప్రబలును,
"మంచియెల్ల కలియు మంటిలోన.
"అయ్యో! నాదు పాప మది యెట్టిదో కాని,
"చెవులు గనులు గల్గి యవియె లేవు.
"ఇంక నాదు ప్రజల కెక్కడి న్యాయంబు?
"దేవుఁ డొసఁగు విధినిఁ దీర్చు టెట్లు?
"దైవదండన మిఁకఁ దప్పదు కాఁబోలు!
"శ్రీహరీ! యిదేమి యూహా! - భయము."
అంచుఁ జింతించి, పలుగతు లాత్మ నెంచి,

శిల్పిరావించి, తనయూహఁ జెప్పి, పంచి,
పది దినమ్ములు నొకవెట్టివలెఁ జరించె.

శిల్పకారులు నింతలో సల్పినట్టి
కార్యమును గూర్చి యొక్కింత కలదు నుడువ:
అల బహిర్ద్వారమున కింక వెలుపలి దెస
నందమగు నొక్క పీఠంబుఁ బొందు పఱచి,
దానిపై రెండు సింగముల్ పూనినట్లు
కంచుతోఁ బెద్ద గంట నిర్మించినారు.
కంచుకేరీతి పదను గల్పించినారొ!
గంటమ్రోఁగిన నూరెల్ల ఖంగు మనుచు
నంతిపురమును బురమును నటకు దెచ్చు;
ఇంక సింగంబు లంటిమా? యెట్టి వార
లైనఁ దొలిచూపులో విగ్రహము లటంచు
నెన్నఁ జాలక, భయమున మిన్నకుందు;
రంత సహజంబుగాఁ దోఁచు ననిన మీర
లతిశయోక్తియన్ భ్రమ నంద ననవసరము.
అక్కటా! నిజం బతిశయం బటులు దోఁచె!
ఆ దినంబుల మన శిల్పు లందినట్టి
నేర్పు నేఁడైనఁ బెరవారు నేర్వఁ గలరె?
సంశయం బున్న 'నెలొరా' 'యజంతము'లను

కొండ తొలువంగ నేర్పడ్డ గోపురములఁ
జూచి యేనియు మనవారి సూక్ష్మబుద్ధి
నిపుణతయుఁ గాంచఁగా వచ్చు నిపుడుఁ గూడ.
అటి నైపుణి యంతయు నడుగువట్టె;
ఒరులు పొనరించు చిప్పల కొఱగవలసె,
దేశశిల్పులఁ బోషించు దిక్కులేక;
ఏమనఁగవచ్చు మనహైన్య ? మింకఁ గథకు-

పీఠమందు నొక్క పెద్ద పటికజాతి
పలకనుంచి దానిపైని వ్రాసి
రింపు గులుకునట్టి కెంపు రవ్వలతోడ,
దూరమునకుఁ గూడ తోఁచునట్లు:
"ప్రభుల న్యాయ మందవలసిన వారెల్ల
"గంటమ్రోఁగఁ జేయఁ గాంతు రద్ది."

ఈగతి ననంగపాలుఁ డుద్యోగుల పని
చక్కఁజేసి, దురాచార ముక్కడంచి,
న్యాయ మందఱ కొకరీతి నందఁజేసె.

అంత నొక్కనాఁ డెండ యత్యధిక మగుచు,
పిట్టలును గాలు వెల్వలఁ బెట్టకుండ,
మండుచుండఁగ నొకకాకి యండనుండి
సింగములు పూను నెట్టనిరంగు గంటఁ

గాంచి, పఱతెంచి, ముక్కునఁ గల బలముచఁ
బొడిచి, పైకెగసి, మరలఁ బొడువ వచ్చి,
తుట్టునను బాఱి, లోపల దూరి, వెడలి ...
కొన్ని నిముసంబు లీరీతి నున్నపిదప,
ఖంగు ఖంగని మ్రోఁగె నాగంట యొకటఁ;
గాని, బెదరక నిలిచెను గాక మటనె.
మట్ట మధ్యాహ్న మిదియేమి పుట్టెనో యని
యూరి వారును నగరిలో వారుగూడ
వచ్చి; రంతలోన ననంగపాలుఁ డచటి
కేఁగి "గంట మ్రోఁగించి నారెవ్వ?" రనిన
యంతఁ, గాకి - బెదరెనేమొ - యవలి కెగిరె.
"ఓసి! పాడుకాకి యూరకే యిందఱ
"నిచటి కీడ్చితెచ్చె; నెంతచేసె?
"నాదు నిదురపోయె; నాదు కార్యము పోయె;
"నే నిచటికి వచ్చుటేల చెపుమ?
"యెంగిలి తిని క్రొవ్వి యేమిచేయఁగ లేక
"బాగు చేసె నమ్మ పాడుకాకి"
అనుచునంద ఱటుల నాకాకిఁ దిట్టుచు
నుండ, రాజుసూచి "యుండుఁ" డనుచుఁ

జింతచేసె:

గంట యెంతో కాలమునుండి
యిచట నుండ, నేఁ డిటేల యగుట?
సింహములు నిజంపు సింహములను బోలి
లోకమునె భ్రమింప, కాకి ఘనమొ?
కాన, సింహములని కాకంబు దలపోసె;
సింగములు తినంగఁ జెదరిపడిన
ముక్క లేమిరైయెనఁ జిక్కవా యను నాశఁ
జేరి చూడవచ్చె చెంత; కంత
నెండతీక్ష్ణ మగుట నెట్టఁగా నుండిన
గంట నెంచె మాంస ఖండ మనుచు.
సింగ మున్నచోటఁ జేరును గాకంబు;
సహజ మంచుఁ బల్కె జనులు వినఁగ:
"దోస మయ్యె నాది; మోసంబుఁ జేసితి;
కాకి దోస మున్న ఘనము గాదు.
వాది కాకి యయ్యెఁ; బ్రతివాది నేనైతిఁ;
దప్పు నాదె యంచు నొప్పికొంటి.
ఇంక మీఁద నిటుల నే జీవియైనఁ దా
నాస వచ్చి మోస మందకుండ
నిచట దినదినంబు నీ సింగముల నోట

మాంస ముంచుచుందు మఱుఁగు మఱుఁగు.

న్యాయ మనిన నొక్క నరుల కొఱకె గాదు
చిన్న జీవులకును జెందవలయు."
అనుచు నా రీతి చేయించె ననఘమూర్తి.

దైవభీతికి దాక్షిణ్య భావమునకుఁ
దొలి యనంగుని నెన్నంగ వలయుఁ గాదె?
పులుగులకు గూడ న్యాయంబు పొందఁజేయఁ
గలుగునెయ్యది? యీ సింహ ఘంటతప్ప!
"సృష్టి నల్ప జంతు వెయ్యదియైనను,
నరుని సమమె యనెడి నరుఁడె నరుఁడు,
అట్టి వర్తనంబె ప్రార్థనీయం బగు,
వాఁడె ప్రియుఁడు జగతి పరమునకును."

---

# విచారణ దినము

( హేళన రచన )

ఆవి "భావకవిత్వము" ప్రచారం లోనికి వస్తున్న రోజులు. ప్రబంధ కవిత్వ సంప్రదాయంలో నున్న మాకు ఈ కవిత్వం కొంచెం వెగటుగా ఉండేది. వారి పదజాలము, ప్రణయప్రకోపము, ఉపమాన సరణీ, చూచి నవ్వుకొనే వారము. వంగదేశ వాసననీ ఇంగిలీషు ఎంగలి అనీ అనుకొనే వారము. వారిలో కొందరు సిద్ధహస్తుల రచనలలోని గుణాధిక్యము గుర్తించి లోలోన మెచ్చుకోక పోలేదు. ఇంతకు, ఎవరి యిష్టం వచ్చినట్టు వారు వ్రాసు కోవడానికి ఇంకొకరి ఆక్షేపణ ఏముంటుంది ? కాని, ఆ నాటి భావకవులలో కొందరు ప్రబంధ కవులను అవహేళన చేస్తూ ప్రసంగాలు చేయడం సహించలేక పోయేవారము. ఆ ప్రబంధ కవుల కవితలను బాగా అర్థం చేసుకున్నవారు అలా హేళన చేసినా, ఏమో అనుకోవచ్చును. ప్రబంధ కవులల్లో లోపాలు లేనని ఎవ్వరూ అనరు. కందుకూరి వీరేశలింగం పంతులు గారు అభాగ్యోపాఖ్యానము వ్రాసి ఆ లోపాలను సుస్పష్టం చేశారు.

ప్రబంధ కవులు ఒకరిని చూచి ఒకరు రచించారంటే, వీరు మాత్రం ఆ పని చేయలేదా ? ఇతర భాషా కవులను అనుకరించలేదా ? ప్రబంధ వర్ణన లన్నీ ఒక్క అచ్చునపోసినవే అంటే, వీరి లలిత కోమల మృదు మధుర పదజాల మంతా ఏమనాలి? పాత వారి శృంగారసం మితిమీరి ఉందంటే, వీరి ప్రణయ వర్ణనలు మాత్రం ప్రకోపించి పోలేదా ?

ఈ అభిప్రాయంతోనే "అచ్చుతప్పు" అని ఒక చిన్న వ్యంగ్య వ్యాసం వ్రాసి సమదర్శిని పత్రికలో ప్రకటించాను. (దాని ప్రతి నాకు ఎక్కడా చిక్కలేదు.) దానిలోని విషయం ఏమిటంటే: మూడు నాలుగు ముత్యాల సరాలు వ్రాసి నా ప్రణయ హృదయాన్ని ఒలక బోశాను. ఆ "ఖండకావ్యం" చిన్న పుస్తకంగా అచ్చు వెయ్యమని ముద్రాలయాని కిచ్చాను. తీరా, పుస్తకం అచ్చయిన తరువాత చూస్తే, ఏముంది? ప్రణయ

అన్న మాటలోని 'ణ' అన్న అక్షరానికి బదులు 'ళ'' అన్న అక్షరం అచ్చు తప్పుగా పడ్డది. దానితో ప్రణయ శబ్దం ప్రళయంగా మారి పోయింది. అచ్చువారి నడిగాను. నేను వ్రాసి యిచ్చిన కాగితం తెప్పించి చూచాము. నా వ్రాతలోని 'ణ' సరిగా లేక, 'ణ'కు'ళ'కు మధ్యస్థంగా ఉంది. దానికి తోడు ఆ కంపోజిటర్ ''క్షమించండి ; ఆ పద్యాలలో మీరు వర్ణించిన దురవస్థ అంతా ప్రణయాని కంటే ప్రళయానికే బాగా సరిపోతుంది కాదా'' అన్నాడు. మారు మాట లేకుండా యింటికి తిరిగి పోయాను.

ఆ రోజులలో కొందరు భావ కవులు ''మా కవిత్వం ఒక పాతికేళ్ళ దాకా మీకు బోధపడదు లెండి'' అని కొంత అహంభావముతో చెప్పుకొనే వారు. వీరిలో ఒకరు వ్రాసిన భావగీతాన్ని మరొకరు ఆకాశాన కెత్తి వేస్తూ ప్రశంసిస్తూ ఉండేవారు. ఇదంతా మాకు దుస్సహంగా ఉండేది.

ఆ నాటి మా అభిప్రాయము సమర్థనీయ మని ఇప్పు డన లేము ; కాని, ఆ రోజులలో మా కది మహా సవ్యంగానే కనిపించేది. ఆ ఊహతోనే ఈ ''విచారణదినము'' వ్రాసి 1929 అగస్టునెల భారతిలో ప్రచురించాను. ఈ 30 సంవత్సరాలలోను వారి కవనమూ మారింది. మా అభిప్రాయమూ మారింది. వారు పూర్వ సంప్రదాయాలు గుర్తించి 'క్రొత్త పాతల మేలి కలయిక' కోసం ప్రయత్నించారు. ప్రబంధ సంప్రదాయంవాగగా ఆ భావ కవనాన్ని నిరసించడం మాని అవగాహన చేసుకోడానికి ప్రయత్నించారు. ఆంధ్ర కవితా పరిణామము మరికొంత అభ్యుదయ మార్గాన ముందుకు సాగింది.

ఈనాడుగూడా ఈలాంటి విచారణలో నిలబెట్ట దగిన కవిసోదరులున్నట్టయితే, వారు కనీసం ఒక్క పూర్వకవీశ్వరుణి నయినా బాగా అర్థం చేసుకొని పఠించవలసిందని కోరుతున్నాను. విషయ పరిజ్ఞానము లేక పోవడమే వైషమ్యాలకు కారణంకాదా!

ంంంం○ంంంం

# విచారణదినము



అదె సర్వతీరాజ్ఞి, వీరఖిలశాస్త్ర
పారగులు, వారె సత్కవిత్వ ప్రచండు,
లిదిగొ ప్రజ, విచారణ దినం బిదియె సుమ్ము;
చెప్పుకొనవయ్య కవి ఏమి చెప్పఁగలవొ.

తొలి నీ కిచ్చిన శేముషీధన మదెం
        తో, దాన నీ యుక్తి కౌ
శలముల్ గూర్చిన మేల దెంతయొ, వినా
        శం బందె నం దెంతయో,
తెలియం గోరుదు రోలగంబున, రవం
        తేన్ పొచ్చమున్ దాళ, రా
వలఁజింతించిన లాభ ముండదు కవీ,
        వాక్రుచ్చు మేమున్నదో.

కవి యని పేరు పెట్టుకొని,
        గారడి చేసి, నిరర్థకుండవై,
యువకుల మోసపుచ్చి తని
        యున్ పెనునేరము మోపఁ బూని;
రవు నది గాదటంచు నిజ
        మాడి, స్వదత్తమహాభిధాన గౌ
రవమును నిల్పుకో కవి, తి
        రమ్ముగ నమ్మిక బుట్టఁ బల్కుచున్.

రస మని వ్యంగ్య మంచును ని
    రంతరమున్ పచియించు, చిట్టె యా
కసమున సౌధ రాజములు
    గట్టుచు నుందువు వేరఁ జేర; నీ
పస వెలుఁగన్ వలంతులు స
    భాస్థలి వీరె ప్రచండ తేజులై
యెసఁగుచు నున్నవారు; వచి
    యింపు కవీ, నిజమేమి నేర్చితో.

పదములు వ్రాయ నేర్తునని
    పండ్లిగిలింతువు, కాని వానిలో
పదముల కుండు రూపు లెటు
    వంటివొ, అర్థము లెట్టు లుండునో,
పదముల కూర్పు నందు గను
    పట్టెడు శక్తివిశేష మెట్టిదో,
కొదుకక చెప్పుమందు రిది
    గో విను, నేర్చిన చెప్పు మోకవీ.

నీ పద్యంబుల లోని యర్థమును గా
    నీ, మేలి భావంబుఁ గా
నీ, పాటించు నరుండు వ్రేల్మొడువనుఁ
    లేఁడంచు ఛీ యందు వా

రా! పల్మారులు; గాని పూర్వ కవిరా
డ్గ్రి-ఘాళిలో, దేనిలో,
నే పాఠంబుఁ గీవ చెప్పఁగలవో
యీ యర్థ లేశంబునేని?

పలుక తెలుఁగ నట్టి పెర
బాస కవీశులు వ్రాయు శేముషీ
విలసిత భవ్య నూతన వి
వేక విరాజిత కల్పనోత్కరం
బుల నిజ కల్పితంబులను
బోలె రచించి నటించి చంచు వీ
రలు నిను దాఁచువారు; కను
బ్రామిఁగఁ గాదిఁక, కాచుకో కవీ.

నోటికి వచ్చినట్టు స్వజ
నుల్ నుతియింప రచించి మేటివై
పాటలు పాడు కొమ్ము, నిను
వల్లర; మా ప్రథమ మహా కవీశులే
పాటి? యొకండు పల్కినది
పల్కె నొకండు, స్వతంత్రుఁ డేడి, యం
చేటికి వ్రేలినాఁడవో వ
చిఫ కవీ చదువున్న సుంతయేన్.

ఇర్వది ముప్పదే పదము
        లిట్టటు బెట్టుచు చిందు ద్రొక్కుచున్,
పూర్వపు సత్కవీశ్వరుల
        పొత్తము లందలి వస్తు వర్ణనల్
సర్వము " చూచి వ్రాఁత " యని
        చంకలు గ్రుద్దుచు వెక్కిరింప నీ
గర్వ మదేల యందు రదె,
        క్రమ విపంచిక మీటి చెప్పుమా.

కోమల మోహ నాది పద
        గుంభన గల్గిన ఖండకావ్యముల్
మేము గ్రహింప లేము, నిజ
        మే, మము తిట్టకు; మొక్కసారి యా
నీ మహితార్థ భావముల
        నీవయినన్ సెల విమ్మటంచు నెం
తే ముదమంది కోరి; రిఁక
        దిక్కులు చూడక చెప్పుమో కవీ.

నీ సరి బుద్ధి మంతులగు
        నెయ్యురఁ గూడి, యొకండు పత్రికన్
వ్రాసిన నాల్గు గీతల సె
        బాసు భళీ కవిభావ మంచు నా

కాపము ముట్ట వేరొకఁడు
గానము చేయుచు, ఆంధ్ర లోకమున్
మోసము చేసినార లట;
నోరు మెదల్ప విదేల యోకవీ?
ధన్యుఁడ విన్ని ప్రశ్నలకు
ధైర్యమునన్ బదులీయ గల్గి యీ
మాన్యుల నచ్చఁబల్కి బహు
మానము నందితి వేని; అట్లుగా
కన్య విధంబెయై పెదవు
లాడక గ్రుక్కెదవేని, పండిత
మ్మన్యుఁడ నైతి నంచు నొక
మాటిఁక చెంపలు వేసుకో కవీ.

—o—

# తిక్కన పట్టాభిషేకము

(కవిప్రశంసా రచన)

**వరా** అబ్బాయి మోహనరావుకి 7, 8 సంవత్సరా లున్నప్పుడు చిన్న చిన్న పద్యాలు జ్ఞాపకముంచుకోగల నేర్పు ఉండేది. నీపేరేమిటంటే ఒక కంద పద్యములో జవాబు చెప్పేవాడు. ఊరక అదేపనిగా నా మిత్రులు పేరు చెప్పిస్తూ ఉంటే, ఇది మీకు ధర్మంకాదు అని చెప్పడానికి ఒక పద్యం చదివేవాడు, (ఈ పద్యాలు నేను చెప్పినవే లెండి). ఇంతలో వాడికి హిందూదేశచరిత్ర చెప్పవలసి వచ్చింది. ఆ తరగతి పాఠ్యపుస్తక ములో బుద్ధుడు, అలెగ్జాండరు...ఈలాంటి పేరులతో చిన్న చిన్న పాఠాలు ఒక పాతిక ఉండేవి. ఈ పాఠాలనే చిన్న చిన్న మాటలతో 24, 28 పాదా లకుమించకుండా గీతాలు గాని మంజరీలు గాని వ్రాస్తే బాగుండదా అని నాకు తోచింది.

ప్రథమపాఠంగా " నాజన్మభూమి " అని భారత వర్షాన్ని గూర్చి వ్రాశాను.

ఆకలి గాకుండ నన్నమ్ము పెట్టి,
వలసినట్టుల గట్ట వస్త్రమ్ము లిచ్చి,
చదువు సామునిచ్చి సత్కీర్తి నిచ్చి,
నన్ను పెంచిన తల్లి నా జన్మభూమి,

కొండ లెత్తుగ చుట్టు గోడలై యుండ,
సంద్ర మావల పెద్ద కందకం బనగ
శత్రు రాజులనుండి చక్క రక్షించు
నా నమ్మకపు కోట నా జన్మభూమి.

ఇలాగే 'నా ధనమ్ముల పెట్టె నా జన్మభూమి' 'నా పూలతోట యీ నా జన్మభూమి' 'నా పాఠశాల యీ నా జన్మభూమి'...అంటూ మనదేశ ఖనిజ, సస్య, విద్యాది సంపదలను గురించి వ్రాశాను. సహృదయులు సంతోషించారు. భారతిలో దానిని ప్రచురించాను గూడ.

ఆ వేదిక మీదనే బుద్ధుడు, అలెగ్జాండరు...విక్టోరియా మొదలైన పాఠాలు వ్రాసి మోహన్‌చేత చదివించేవాడను. ఇంతలో స్కూళ్ల ఇన్‌స్పెక్టరు వాడిబడి తనిఖీకి వచ్చి విద్యార్థులను ఓకొచ్చిన పద్యం చదవండన్నాడు. మా వాడిదగ్గరకు వచ్చినప్పుడు

"రాజులుపోదురు, రాజ్యముల్ పోవు
కలకాల ముందును కావ్యమొక్కటియె

అని నేను వ్రాసిన "నన్నయ - రాజరాజనరేంద్రుడు" అన్న పాఠములోని పద్యాలు చదివాడు. ఎక్కడివీ పద్యాలని అడగడమూ, అమూలంగా ఆ ఇన్‌స్పెక్టరుగారు నన్ను చూడడమూ తటస్థించింది. నేను వ్రాసిన ఆ 25 పాఠాలూ "గీతచరిత్ర" అన్న పేరున ప్రచురించినట్టయితే బాగుంటుందని అనుకున్నాము. (వీటిని తరువాత కొన్నాళ్ళకు 'సమదర్శిని' ద్వైవారపత్రికలలో ప్రచురించాను. ఇప్పుడు నా దగ్గర వాటిప్రతులు గూడ లేవు. అవి దొరికినట్టయితే వాటిని చిన్న సంపుటముగ "గీతచరిత్ర" అన్న పేరున ప్రచురించగలను). ఆ సందర్భంలో వారు తిక్కన గురించి వ్రాశారా అని ప్రశ్నించారు. దానికి నేను "తిక్కన్నకు ఇలాగ చిన్న చిన్న పద్యాలు కాదు; పెద్ద పట్టాభిషేకమే చెయ్యాలనుకుంటాను" అని సమయానికి తగినట్టు బదులు చెప్పాను.

తరువాత కొన్నాళ్ళకు "తిక్కనజయంతి" ఉత్సవంలో నన్ను పాల్గొనమన్నారు. అప్పుడు నా వాగ్దానము జ్ఞప్తికివచ్చింది. ఆ నాటి రచనను "అపూర్వపట్టాభిషేకము" అన్న పేరుతో 'సమదర్శిని' ఉగాది సంచికలో 1932లో ప్రచురించాను. నా రచన మరీ దీర్ఘంగా ఉండడంవల్ల, దానిలోని కొన్ని భాగాలను అప్పుడు విడిచిపెట్టవలసివచ్చింది. ఆ విడిచిపెట్టిన భాగాలప్రతులు గూడ ఇప్పుడు నాదగ్గర లేవు. ఇక లభ్యం కావని గూడా అనుకుంటాను.

సామాన్య పాఠకుల నుద్దేశించి వ్రాసిన ఈ రచన పండిత సహృదయులకు ఏ కించిదానందాన్ని కూర్చగలిగినా నేను ధన్యుడననే భావిస్తాను.

# తిక్కన పట్టాభిషేకం

ఆంధ్రులు రండు, మా యన్నలు రండు
తెలుఁగు తల్లిగ నెంచు ధీరులు రండు,
వాడవాడల తెల్గువారెల్ల రండు,
బుజము లుప్పొంగఁగా, ముదము సెలఁగ
సంతోష మలలయి జాలుకొనంగ,
హృదయముల్ త్రుళ్లంగ నింపు గుల్కంగ
నుత్సవంబును జేయ నున్నది నేఁడు.

చిన్న కార్యము గాదు, చిటికిది గాదు,
సామాన్య మగునట్టి సందడి గాదు :
జగము నెందునలేని సొగసు గలట్టి
పట్టాభిషేక మీ పండుగు మనకు.

నిన్న రాజ్యం బేలి నేఁ డేఁగునంత
ప్రజలు మఱచునట్టి రాజుది గాదు,
పన్నులఁ దినుటయె భాగ్యమం చెంచి
పాలించు నొక మహాప్రభునిది గాదు,
వస్త్రరాజుది గాదు, బలునిది గాదు,
ధనరాజులది గాదు—ఘనకవీశునిది.

కవీశప్రశంస

అందఱురాజుల వలెఁ గాదు కవియు :
శుద్ధాంతములనుండి చూడఁ గాదనఁడు,
కనఁగోరినంతఁ జయ్యన నే గుఁదెంచి

చక్కఁగా మాట్లాడు సంతృప్తి నొసఁగ,
బీద లం చెంచక ప్రేమతో వచ్చి
కష్టకాలంబులోఁ గడఁ ద్రోయు వెతల,
ఏకాకులై తోడు నెఱుఁగనివారి
తోడునీడగ నుండు దూర ముం చనక,
ఆనంద మందెడునట్టి వేళలను
గూడి సంతోషంబు కొఱలేక చేయు,
ఏ యుపాయము మది నెఱుగని వేళ
చెవిలోన మార్గంబు సెప్పఁగా వచ్చు,
తెలిసి దోసము సేయ దెప్పుడు మనల
నీతుల మఱిమఱి నేర్పుచు నుండు.

ప్రాయంబు సెడకుండ బలము పోకుండ
కలకాలముండు నిక్కవిరాజు ధరను.
మృతి నెన్నఁడెఱుఁగని బ్రతుకు గలట్టి,
దివిజ సమానులై భువిఁ బుట్టునట్టి,
ప్రజలు సంతసమున వరియించునట్టి,
సత్కవిరాజుల సార్వభౌముండు,
ఘనబుద్ధి శాలురకును చక్రవర్తి
ధీరవిచారుల రారాజు గలఁడు:
తిక్కనార్యుం డతితేజోమయుండు,
అతనిదే నేఁటి పట్టాభిషేకంబు.

* మనకృతజ్ఞతఁ జూపఁ జనదటే మనకు?
రాజభక్తిని జూపరాదటే మనము?

కాపున రా రండు కవిరాజరాజు
పట్టంబు గట్టఁగాఁ గట్టుడీ నడుము.

భవననిర్మాణము *

అమృతంబు బాఱుచు నతిరమ్యమగుచు
మిగుల విస్తీర్ణమై సొగసైన యట్టి
ఆంధ్రవాక్కను బయ లల్లదే! కనుఁడు
కను మేర కున్నది కాంతిగొల్పుచును.
అట నొక్క సుందరహర్మ్యంబు నిపుడు
నిర్మింపఁగా రండు నేర్పుమీఱంగ;
గుణగౌరవముల బాగుగ విమర్శించి
నీరసభావంబు నిల్వనీయకుఁడు;
అప్రయోజకపు పదార్థంబు లెల్ల
తొలఁగింపుఁ డిపుడె నిర్మలముగా నుండ;
భావకవనపు సంభారంబు లన్ని
కొనివచ్చి యొకచోటఁ గూర్చుఁడీ మొదట;
వృత్తములై వింతవింతగ నుండు
కంబముల్ నిల్పుఁడీ క్రమ పాదముల;
ఘనపదార్థంబుల గౌరవం బెఱిఁగి
యుంచుఁడీ గోడ లత్యున్నతంబులుగ;
చక్కని వస్తువుల్ చిక్కఁగాఁ గూర్చి
పైకప్పు గట్టుఁడీ భద్రంబుగాను;

---

*పాఠకమహాశయు లిందలి కావ్యపరిభాషాపదముల యందుఁ గల విశేషార్థముల నారయఁ బ్రార్థితులు. ఉ. పదార్థ (పద-అర్థ)

శిల్పచాతురిఁ జూపు చిత్రమో వింత
కల్పన లుంచుఁడీ కట్టడంబునను ;
నాతిగూఢములగు నవ్యభావములఁ
దెలుచు కవాటముల్ తీర్పుఁ డద్దాన ;
మిలమిల రుచులు చిప్పిలు రస బులను
మేల్పూఁత పూయుఁడీ మిఱుమిట్లు గొలుప ;
పలుపాకములఁగూర్చి వర్ణింపుఁ డన్ని
విషయముల్ శోభను వెదచల్లునట్లు ;
రీతిరీతుల పుష్పజాతులతోడఁ
గట్టుఁడు తోరణాల్ కమనీయముగను ;
అమృతోపమానంబు లగు రసంబులను
కుంభముల్ నిల్పుఁడు కుదురున్న చోట్ల ;
ఆయాస్థలంబుల కర్హామైనట్టి
లస దలంకారంబులను గూర్ప రయ్య ;
నడక నానందంబు నొడఁగూర్చునట్టి
శయ్యలఁ బఱచుఁడీ చక్కఁగా లోన ;
చాలినమట్టుకు సంస్కృతం బగుచు
ముద్దు లొల్కఁగనిండు మురిపెముల్ సూపి.

ఈభంగి సర్వాంగశోభఁ గుల్కుచును,
వినినంతమాత్రానఁ గనఁగోరునట్లు,
చేరి కన్గొనఁ బ్రీతిఁ జెందినయట్లు,
లక్షణంబుల మెప్పులం గాంచునట్లు,
గుంఫనల్ హర్షమున్ గూర్చెడునట్లు,

పొందికఁగాంచి యబ్బుర ముందునట్లు,
భవనరాజముఁగట్టి భవ్యులు గండు.

*

సింహాసనము

ఆ విమానంబున కర్హమైనట్లు
నూతనాలంకార భూతితో మెఱయు,
చిత్రవర్ణంబులఁ జికిలి సేఁతలను
ఘుంటికా పత్ర లేఖనములఁ గలిగి
భావప్రకాశంబు బా గనిమెచ్చ
పాదపాదంబున భ్రమలుపుట్టింప
ప్రకృతిబింబంబునై రమ్యంబునైన
సింగంబు నిర్మించి సేయుఁడీ గద్దె.

ఆహ్వానము

ఇటులఁ బైగె సేఁతల నింపులు నింపి,
వెలుపల లోపల వింతలుగూర్చి,
చూడఁజూడఁగఁ గ్రొత్తసొబఁగుఁ బుట్టించు
చిత్ర మౌ కల్పనల్ చిన్నెలు నుంచి,
దిక్కుదిక్కులకెల్లఁ దెలియంగఁజేయ
భవనోపరిని మన ధ్వజ మెత్తరయ్య.
ఆలస్యమున కింక వ్యవధి లేకుంట
"కవిసార్వభౌమ తిక్కన సోమయాజి

* విమాన (వేదిక) వర్ణన అప్పుడు ప్రచురించలేదు; ఇప్పుడు లభ్యంకాదని మనవి చేస్తున్నాను.

పట్టభద్రుండగు పర్వదినంబు
గావున భవనంబుకడ కర్హరీతి
వచ్చి గౌరవ మందవలయు సుం" డనుమ
జాంఘికులం బంపి చాటింపనిండు,
పంపుఁడీ కవుల కాహ్వానపత్రికలు.

హృదయంగమంబులై శిరసుల నూఁపు
మంగళధ్వనులఁ జెలంగనిం డిచట.

కవీశప్రస్థానము

అల్లదే! సత్కవీ శాధిరాజైన
మన తిక్కనార్యుఁ డీమందిరంబునను
పట్టభద్రుండుగా వచ్చుచున్నాఁడు.

రథప్రశంస

పనిచమత్కృతుల నప్రతిమ మం చనఁగఁ,
గనఁజాలినంత నెమ్మనము లోఁగొనుచు,
నద్భుతం బగుఁ జూడుఁ డా యరదంబు,
భారతం బను పేరఁ బ్రస్తుతిఁగాంచు;
ధీరులౌ కవుల మనోరథం బిదియె.

బంగారు తళుకుఁగు వాడంగ వాడంగ,
వెండి వెల వెలబోవకుండ దెప్పుడును,
ఈ రథం బొకనాఁటిదే కాదటంచు,
లోహంబులం గల్గు లోపంబు లెంచి,

కాంతి పొలివోకుండ, ఘనత పోకుండ,
వన్నె తగ్గకయుండ, వమ్ముగాకుండ,
వేలు లక్షలయేండ్లు వెలయఁగాఁ దగిన
ఘనపదార్థములతోఁ గట్టి రిద్దాని.

ఏ భాగముం గన్న నెచ్చటలేని
సింగార మచటనే పొంగినట్లుండు.
శిల్పసౌష్ఠవమును, కల్పనల్ సొగసు,
తలు లూఁచునట్లుంట దానికే తగును.
మనతోడ మెలఁగుచు మాట్లాడునట్లు
గన్పట్టుచుండు చక్కని చిత్రములను
పలుభావముల వ్రాసి వర్ణించినారు;
ఆచిత్రములు నిట్టివని యెంచఁజాల
మఖిల ప్రపంచంబు నందునె కలదు.
పరమేశు సృష్టికిఁ బ్రతిసృష్టి యనఁగ
నన్నియు నద్దాన నమరించినారు.
ధర్మానుచారులు, ధైర్యభూషణులు,
దుష్టులు, కాముకుల్, తులువలు గలరు;
పలుభంగు లగునట్టి పొలఁతులు, యతులు,
నీతి ధర్మము దెల్పు నిపుణులు, గుణులు,
యుద్ధముల్, పురిములు, నుదయాస్తమయను,
లతిఘోరవనములు, నద్రులు, నదులు,
కార్చిచ్చు, ధూళులు గలవు నిక్క మన.

ఒకచోట శృంగార మొలుకుచునుండు
యతులును సంసార యుతులు గాఁగోర ;
ఒక యెడ భయముండు నుచితవర్ణముల
వీరాగ్రణులుగూడ వెఱఁ గందునట్లు ;
కరుణవిశేషంబు గల దచ్చటచట
శాంతిగుండెలను గరంగింపఁజాలి ;
వీరరసం బిట విరియుచునుండు
పిఱికికండకుగూడ ధీరంబుగలుగ ;
హాస్యరసం బట నలరు వర్ణముల
నిసుఁపబొమ్మలను నవ్వించెడు రీతి ;
ఇట్టి వట్టివి యంచు నెంచఁగా రాక
యన్నిరసంబుల నతికౌశలమున
బాపురే నేర్పున వర్ణించినారు.

మున్ముందుగాఁగఁ ద్రిమూర్తులు నడువ
శతఘంటశోభ వేచనుదెంచె నదిగో!
కవిరాజులకురాజు గౌరవింపంగ
నర్హమే కాదె యీ యరదంపు సొబఁగు!
కవిసార్వభౌమ వర్ణనము
ఆ రథరాజమం దర్హాసనమున
సుస్థిరంబుగనున్న సుకవినిం జూడ
నీ యున్నతస్థలి కిటురండు మీరు;
మహనీయ దివ్యవిగ్రహులను జూడ
నున్నతి మన మంద కున్నదే దారి?

అదెచూడుఁ డాకన్ను లత్యద్భుతములు
కనివిని యెఱుఁగ మాకాంతిసంపదలు;
మనుజుల మఱుఁపులు మర్మంబు లన్ని
చొచ్చిచూడఁగలట్టి చొప్పందుగలదు.
ఆ కన్ను లెదుట మాయలు నిల్వఁజాల
వడ్డగింపఁగఁ జాల దా దృష్టినెద్ది.
ఏ వస్తువున నిజం బెట్టుల నుండు
నద్దాని గ్రహియించు నా లోచనములు.
ఎల్లలోకము లోకదృష్టి లోఁగొనుచు
దైవదృష్టిని బోలు ధన్యుని చూపు.

చిఱునగ వమృతంబు గుఱిసెడి పెదవు
లొప్పిద మది యెంత యున్నదో కనుఁడు.
తన వాక్కు లెల్ల శాసనము లట్లుండు
ఘనభావమందునఁ గాంచ నౌఁగాదె!
పల్కు తేనెలతేట లొల్కుచునుండు
తీయందనం బందునే యుండుఁ జూడ.
ప్రభువులు మన్నించు పటుతరవాక్య
గౌరవం బధరానఁ గన్పట్టు నదిగో!
ఊాలను గరఁగింపఁ జాలిన నేర్పు
ననురాగ మందులఁ గనుఁగొనం దగును.
ధర్మముల్ లోన భద్రంబుగా నుంచు
ధరణి బో ల్పెదవుల వైఖరిం గనుఁడు;
భాసు రాలంకార యై సరస్వతియె

పలుకప్పునన్ నృత్యములు సల్పుచుండు.
నప్పు నాలోకించినారలా మీరు?
పండువెన్నెల లబ్ధిపైఁ బర్వినట్లు
సొబఁగున సరిలేని సుఖమును గూర్చు.

ఉన్నతి వైశాల్య మొకరీతిఁ గల్గి
నిగనిగ మెఱయు నా నిటలంబు గన్న
వాగ్దేవి గద్దియవలెఁ దోఁచుగాదె?
బుద్ధి చమత్కారముల కెత్తినట్టి
ఫలకంబువలెఁ గానఁబడు చున్న దహహా!
సర్వప్రపంచంబు సానుభూతిఁ గనఁ
జాలు నాం హృదయ వైశాల్యంబుఁ గనుఁడు.
లోకముల్ కౌఁగిఁటిలోఁ గొనందగిన
భావంబు గన్పట్టు బాహువులందు.
వ్రేళ్లు సూచినయంత వివిధ·చిత్రములఁ
జిత్రింపఁగా బ్రహ్మ చేసినరీతి
నందములై సోఁగలై తోఁచుఁ గనుఁడు.
ఆకారసౌష్ఠవం బది యిట్టులుండ,
గుణవిశేషం బెంచుకొలఁదకి మీఱు.

గుణవర్ణనము

అన్నివిద్యల నేర్చినట్టి పుణ్యుండు
లోకరహస్యంబు లోఁగొన్న ఘనుఁడు
సృష్టివైచిత్రిఁ జూచిన మహామహుఁడు
అన్నిఁట దైవంబు నరయు ధన్యుడు

సనుబుద్ధిఁ దొలఁగని సన్మార్గవర్తి
పక్షపాతములేని పరమధార్మికుఁడు
గర్వంబులేని సత్కర్మ రతుండు
విసుఁ గెఱుంగని సద్వివేకి, బుధుఁడు;
నతనివర్ణింప భారత మగుంగాదె!

భువనవిస్తీర్ణుఁడై పొలుపొందు నతని
పూర్తిగా నొకఁడును గుర్తింపలేఁడు:
చిన్నవారలలోన చిన్నవాఁ డితఁడు
పెద్దవారల మించు పెద్దవాఁ డితఁడె;
చిత్రకారుఁడనుచు, శిల్పియౌ ననుచు,
కొంతెయంచును, తార్కికుండెపో యనుచు,
మంత్రి యటంచును, మహిపాలుఁ డనుచు,
దేశికుం డని, యువతీ ప్రియుం డనుచు,
సిద్ధుఁ డంచును. సాంఖ్యశిక్షకుం డనుచు,
ఖడ్గవీరుఁ డనుచు, గవిరా జటంచు,
నైఘంటికుం డంచు, న్యాయవాది యని,
రాయబారి యటంచు వేయిభంగులను
తమయూహలంబట్టి తలఁతు రా ధీరు.
తలఁచి; యాశాఖల తలమానికముగ
నెంచి యాపుణ్యుఁ బూజించుచుండెదరు.

దేవాంశఁ బుట్టిన ధీరుండు గాన
విశ్వరూపంబున వెలయు టబ్బురమె!

ఆ గుణంబుల నెన్నఁగాఁ గాదు మనకు.
భవనరాజము సేరె కవిరాజు: రండు—

పట్టమహము

భవనరాజము జనభరిత మైపోయె,
నిసుకసల్లిన రాలనీయదు సమితి.
జనుల దందడికోర్వ శక్యంబుగాక
వెలుపల నిల్చిరి వేలు లక్షలును.
మంగళధ్వనులు సెలంగె నెల్లెడల;
జయజయధ్వనులను జనులెల్లఁ బలుక
కరతాళశబ్ద మాకాశంబు నంటె.
సోపానముల భక్తిఁజూపు కవీశు
లంతరంబు లెఱింగి యందందు నిల్వ,
నవ్యభావోజ్జ్వల దివ్యాంగులైన
కీర్తిధనుల్ భక్తిఁ గేలూఁత లొసఁగ,
సరదంబు డిగ్గి సింహాసనంబునకు
మందయానమున నమ్మహనీయకీర్తి
కవిసార్వభౌముండు గదిలి, కూర్చుండె,
తనదు తేజము దిక్కులను బర్వుచుండ
నుదయాద్రి నరుణార్కుఁ డుండినయట్లు.
భేరి, దుందుభి, జయవీరణ, తూర్య,
పటహ, కాహళాదిపటురవం బెసఁగ,
వేదపాఠంబులు వీనులవిందు
లై సుస్వరంబుల హర్షముం గూర్ప,

నుత్సాహ భరితులై యున్న యాజనుల
సన్నుతుల్ జయజయశబ్దముల్ బెంప,
కవులు గుణంబుల గణుతించుచుండ,
ఘనభోంతరములు బోరున మ్రోసె.

భారతీదేవియేతెంచుట

సందడి చెలఁగు నా సమయంబునందు
దిక్కులఁ గాంతులఁ దేజ మందించు
దివ్యయానమున నేతెంచె నయ్యెడకు
భాసురదరహాస, భారతీదేవి,
దివ్యవిగ్రహ, మహాభవ్యచారిత్ర,
వేదసేవిత, సద్వివేకనిధాన
అమృతమయాంగి లోకానందమూర్తి,
సంగీత సాహిత్య సంజ్ఞావిలాస,
ఆశ్చర్యమున జనులందఱుఁ జూడ.
కుతుకంబు మదిలోనఁ గుల్కుచునుండ,
నానందపారవశ్యము గాంచి, దేవి
కరముల రెంట సుందరకిరీటంబు—
కవిరాజ సన్మస్తక ప్రశస్తంబు,
దివిజనిర్మితము, సందీప్యమానంబు—
నొకదానిఁ దిక్కన యుత్తమాంగమున
నుంచె, జూచినవార లుబ్బితుళ్లఁగ.
మఱి రెండుకరములఁ గుఱియుచునుండె
కల్పకసుమము లతుయములై మీఁద.
జయజయధ్వానముల్ జగముల నిండె,

నమరులు పుష్పవర్షము సల్లినారు,
కవిరాజు లప్పుడు కడు భక్తితోడ
శ్రమఁగని యార్జించి సమకూర్చినట్టి
వెలలేని మేలికాన్కల మెచ్చునిచ్చి,
యవకాశమబ్బె నం చానంద మంది
తమరాజభక్తి నందఱు దెల్పుకొనుచు
చరితార్థులైయున్న తెఱఁ గెన్నఁదరమె.
కవిచక్రవర్తి తిక్కనసోమయాజి
పట్టంబు కన్నులపండువై మించె.

దృఢ ప్రతిజ్ఞ

మును పెట్టి మంచినోములు నోఁచినామొ,
నేఁ డీ మహంబును జూడఁ గల్గితిమి;
చూచి కృతార్థతఁ జూఱగాఁ గొంటి;
మిఁక మన మేకాన్క లీయఁగాఁ గలము ?
బుద్ధి సంపదల గోల్పోతిమి గాదె,
గుణవైభవములకు గొదవఁ గాంచితిమి,
భక్తివిశ్వాసముల్ పాసెను, పేద
వడి యెట్టు లిత్తు ముపాయనంబులను ?

కావున నొకమాట గట్టిగాఁబల్కఁ
డాంధ్రసోదరులార అందఱుమీరు;
కవిసార్వభౌమతిక్కనమంత్రి చంద్రు
నొకనాఁడు మఱవమం చూహించి యనుఁడు;
తిక్కనవాక్కులు తృషదీఱ నెపుడు

పారాయణము సేయ జూసచేయుండు;
తన కావ్యమందునుం దనయందుఁగూడ
భక్తి నేమర మంచుఁ బ్రతినఁ బూనుండు;
ఆ భావముల నెంచి యానందమంది
స్మరణచేసెద మంచు శపథంబు గొనుఁడు;
నాల్గుమాటల నాడఁ గల్గినయంత
వానిఁ బ్రస్తుతిసేయ వాగ్దానమిండు;
తనయందు భక్తియే మన గౌరవముగఁ
బరికింప సుస్థిరభావంబు గనుఁడు.

ఇదియె సాధనమందు రిహపరంబులకు.

ఫలశ్రుతి

ఈయుత్సవశ్రేష్ఠ మెట్టులనైనఁ
జూచిన పుణ్యుల లోచనంబులును
వినఁజాలువారల వీనులజంట
మది నెంచఁజాలిన మానసంబులును
ధన్యముల్, ధన్యముల్, ధన్యంబులెపుడు!

———

# నల్లిపై కారుణ్యాము

(వ్యాజస్తుతి రచన)

ఆంగ్లవాఙ్మయ సంపర్కంవల్ల ఆ రోజులలో (ఇప్పటికి 50 సంవత్సరాలకు ముందు) ఆంధ్రభాషాభిమానులకు అనేక విధాలయిన ఆలోచనలు కలుగుతుండేవి. ఆంధ్ర సారస్వతము కాలానుగుణంగానూ సమగ్రంగానూ ఉండాలంటే, ఎన్నో కొత్తశాఖలలో రచనలు జరగాలని అనుకున్నారు. విజ్ఞాన చంద్రిక వారూ ఆంధ్రభాషాభి వర్ధనీ సమాజము వారూ విశేషించి శాస్త్రగ్రంథాలను, చారిత్రక గ్రంథాలను ప్రచురిస్తుండే వారూ.

బి. యే. పరీక్ష ముగించుకునేటప్పటికి నాకూ చాలా ఆలోచన లుండేవి. నవలా నాటకాది రచనలలో ప్రకృతి వర్ణనలు, స్వభావ నిరూపణ ఉన్మీలనాదులు విశేషంగా ఉండాలని అనుకొనేవాడను. అంతేకాదు, ఇంగ్లీషులో ఉన్న అనేక వాఙ్మయశాఖలు మన భాషలో కానరావు కాబట్టి, మన రచనలను కొత్తపుంతలకు తిప్పాలని భావించేవాడను. ఆ అభిప్రాయాలనే ఆనాడు బొంబాయి నుంచి వెలువడుతుండే ఆంధ్రపత్రిక ప్రప్రథమ ఉగాది (1911) సంచికలో "ఆంధ్రులకొక మనవి" అన్న పేరున వ్యాసం ప్రచురించాను. ఆ అభిప్రాయాలతోనే "వేగుఁ జుక్క" గ్రంథ మాలను బరంపురములో 1910-11 లలో స్థాపించాము. ఆంధ్రభాషలో మొదటి వాఙ్మయ చరిత్రను ఉషఃకాల మన్నపేరుతో 1911లో ప్రకటించాము.* మొదటి నిరూపక నవల 'వాడేవీడు', మొదటి భావపరిణామ నవల (సైకొలాజికల్) 'కొవ్వురాళ్లు', మొదటి ఆంధ్రచారిత్రక నాటకము 'ప్రేమము' మొదలయిన గ్రంథాలను ప్రచురించాము.

అనుకొన్న ఆ కొత్తపుంతలలో ఒకటి 'ఎలిజీ' రచన. ఇంగ్లీషులో మహాప్రఖ్యాతిగాంచినఎలిజీలు మూడు నాలుగు. గ్రే, మిల్టన్, ఆర్నాల్డు,

---

* వంగూరి సుబ్బారావుగారి వాఙ్మయ చరిత్ర 1920 నాటిది.

టెనిసన్ కవులు వ్రాసినవి. ఇవిగాక, గోల్డ్‌స్మిత్ "పిచ్చికుక్కచావు మీద" ఒక ఎలిజీ వ్రాశాడు. తెలుగులో అటువంటి రచనలు లేవు. అసలు ఎలిజీకి మన భాషలో ఏమనడమో తెలియక "కారుణ్యము" అని పేరు పెట్టి, ఈ రచన చేసి, అప్పుడు బొంబాయి నుంచి వస్తూన్న ఆంధ్రపత్రికలో (అప్పుడది వారపత్రికే) ప్రకటించాను.

ఈ వ్రాతను పురికొల్పిన సన్నివేశం మనవి చేస్తాను; మంచంమీద గోర్లాపండుకొని, గుండె కింద దిండు పెట్టుకొని ఏమిటో వ్రాస్తూన్నాను. నల్లి విపరీతంగా కుడుతూంది. ఏమిచేసినా దాని బాధ తప్పేటట్లు లేదు. చేతిలోని కలం అక్కడుంచి, నల్లిని వేటాడి పట్టుకొని, బయట యెండలో బాగా కాలిఉన్న గచ్చు చప్టా మీద దానిని విడిచిపెట్టాను. అల్లల్లాడి మాడి చచ్చింది. లోపలికిపోయి కలం పట్టుకొనేటప్పటికి, గోల్డ్‌స్మిత్ వ్రాసిన పిచ్చి కుక్కచావు ఎలిజీ జ్ఞాపకానికి వచ్చింది. అలాగా నేనూ ఈ నల్లిచావుమీద ఒక కారుణ్యం వ్రాస్తే బాగుండదా అని, చేతిలోని వ్రాత అటుపెట్టి ఈ రచనకు పూనుకున్నాను.

మరొక్క విశేష మేమంటే, పత్రికలో పడ్డతరువాత మా విమర్శక సమాజములో దీనిని విమర్శించడానికి పూనుకొని ఈకకు ఈక తోకకు తోక తీసేస్తున్నారు. ఇంతలో నేనటు వెళ్ళడం తటస్థించింది. నన్ను గూడా ఈ రచనను విమర్శించమన్నారు. (ఆ సమాజం ఆరంభం చేసింది నేనే. నావిద్యార్థులే అందులోని సభ్యులు) తప్పుతుందా? నేను చెప్పిన దొక్కటే: "ఆ నల్లి చాలా అదృష్టం చేసింది. ఎన్నిటిని మనము నిత్యమూ చంపలేదు. ఇలాంటి వ్రాత దేనికయినా అబ్బిందా! దీన్ని బొంబాయి పత్రికలో ప్రకటించడం గూడా గొప్పఅదృష్టమే. ఆ పైని మీ రింతమంది, ఇంకా ఆ నల్లిని స్మరిస్తూ ఉండడం చాలా విశేషం". అన్నాను. నవ్వుకుంటూ సభ చాలించాము.

ooo0ooo

# నల్లిపై కారుణ్యము

నల్లిరో! నిన్ను జేకొని ఘ
నంబగు నాతపమందు వైచి, నీ
వల్లల నాడుచుండ, దర
హాసము చేయుచు జూచుచుండు నీ
కల్లరివాని దూఱవు; ము
ఖంబునఁ గోపము జూప; వెంతరో
చల్లఁగ నోర్చి; తౌర! ఘన
సౌఖ్యము నాకమునందుఁ గాంచవే?

"ఎండ కన్నెఱుఁగక యేవేళఁ బ్రాసాద
వీథులఁ జరియించు విధమ యిద్ది?
"మెత్తని పాన్పుల మెలఁగుచుండెడు నట్టి
దేహమా యిటు లయ్యె తీవ్రవదన?
"పలుభోజ్యము సోలు వారియందలి మేలు
నారగించెడి జీవమా సువర్ణ?
"నానాఁటికిని లలనామణు లెల్లెడ
నుష్ణోదకంబుల నోలలాడఁ

"జేయుచుండుదురా నిన్ను చిన్ని జీవ"
అనుచుఁ గన్నులఁ గ్రమ్మెడి యశ్రు లిన్ని
కుఱియనీకుండఁ బోయెడి క్రూరుఁ డెవఁడు?
మాన్యసుఖవాసి, పోతివా మమ్ముఁ బాసి!

నీకతంబునఁగదా లోకాన బాలురు
నిశలందుఁ జదువుచు నిద్రపోరు ;
నీకతంబునఁగదా నిండుజవ్వనులెప్డుఁ
జెలువలతోఁ గూడి మెలఁగుచుంద్రు;
నీకతంబునఁగదా నిరతమ్ము వృద్ధులు
హరినామసంస్మృతి నలరియుంద్రు ;
నీకతంబునఁగదా నిలయాల కపుడప్డు
సంస్కారధూపముల్ జరుగుచుండు ;

తగఁ"బరోపకారార్థ మిదం శరీర"
మనుట నీకతంబునఁగదా మనుట ధాత్రి ;
అట్టిని న్నెంచఁజాలక, యల్పబుద్ధిఁ
బాప మొడిఁగట్టుకొని చంపఁ బాడియగనె ?

చంపినవాని కేమి ఘన
సంపద కల్గెనో, కీర్తి హెచ్చెనో;
సొంపగు భక్ష్యముల్ రుచులఁ
జూడ విచిత్రములైన పాకముల్
పెంపును బొందెనో; యకట!
పెల్లగు నా నరకంపు కంపుగా
కింపులు గల్గునా? మతి హీ
హీనున కెందును మేలు కూడునా ?

ఎంత విషాద మందితివో;
        యెవ్వరి నేమని చీరితో కదే !
వంతను మాను; మీపగన
        వారిత రీతినిఁ దీర్ప నీదుసత్

సంతతిలేదె? నన్ను రభ
        సంబునఁ బట్టదె? నిద్రఁ దోలదే ?
చెంతను జేరి జీవన మి
        సీ యనఁ గుట్టదె? నెత్రుఁద్రావదే ?



# ఆంధ్రతేజమ, వందనం బంది కొనుమ

(క్షమార్పణ రచన)

అంతకు పూర్వము నేను వ్రాసి ప్రచురించిన విజయనగరాంజనేయము*లో గొడ్డలివేటుతినిన ఆంజనేయుడు

ఆంధ్రతేజంబు గలదె యీ యవని నింక?
సందియం బయ్యె;... ... ...

అని పలికినట్టు వ్రాశాను. నాకారోజులలో ఆ అభిప్రాయము పదేపదే కలుగుతూ ఉండేది. అటు వంగదేశీయులు ఆర్థికరంగంలోనూ సాహిత్యరంగంలోనూ ఎంతో ఉత్సాహంతో పురోగమిస్తుండేవారు. ఇటు తమిళ సోదరులు విద్యలలోనూ ఉద్యోగాలలోనూ ముందడుగువేస్తూ ఉండేవారు. మనవారో! తమకు చాల అవసరమయిన విషయంగురించయినా, శ్రద్ధాభక్తులు కనపర్చేవారు కారు. మహాసభలు ముగిసిన మరునాడే ఆ తీర్మానాల నన్నిటిని మరచిపోయేవారు. అంతా ఆరంభశూరత్వమే.

ఇంతలో గాంధీజీ—అప్పుడప్పుడే 'మహాత్మ' అన్న పేరు వాడుకలోనికి వస్తూఉంది—తన సిద్ధాంతాలతోనూ త్యాగప్రణాళికతోనూ బహిష్కరణ సూత్రాలతోనూ దేశీయుల నందరిని ఊపి కార్యోన్ముఖులుగా చేస్తున్నారు. ఆసేతుశీతనగమూ ఉత్సాహంతో ఉడుకురేగింది. ఆ ఉద్యమములో మన సోదరులు 'యావద్భారతవర్షములోనూ ఆంధ్రులదె పైచేయి' అనిపించారు. గాంధీజీ నియమాలను తూచా తప్పక పాటించారు. ఎటువంటి త్యాగానికయినా తెగించారు. గాంధీజీ ఉపదేశమూ, దేశసేవా తప్ప మరొక్కవిషయము వారి దృష్టిలో ఉండేదికాదు. ఆంధ్రనాయకత్వము, ఆంధ్రమహోత్సాహము, ఆంధ్రత్యాగనిరతి సర్వతోముఖప్రశంసల నందుతూ ఉండేది. ఆ ఉద్యమములో యావద్దేశానికి ఆంధ్రులు ఆదర్శప్రాయు లయారు.

---

*61వ పేజీ చూడండి.

ఆనాడు నేను "విజయనగరాంజనేయము" లో ప్రకటించిన నా సందేహం స్మరణకు వచ్చింది. ఏదో మహాపాపము చేసినట్టుగా భావించాను. "ఆంధ్రతేజ మంతరించిపోలేదు; ఆంధ్రతేజము కలదు, ఇంకా అలరగలదు" అన్న భావము గట్టిగాపర్పడ్డది. దానితో ఆంధ్రులచరిత్ర యుగయుగాలుగా కంటికి కట్టినట్టుతోచింది. ఆయా యుగాలలో జగద్విఖ్యాతిని పొందిన ఆ ఆంధ్రతేజమే యీనాడు ఈ రూపముగ కనబడుతూ ఉందని గ్రహించాను. దోషపరిహారముకోసం ఆ ఆంధ్రతేజానికి క్షమార్పణ రూపంగా ఈ రచన చేసి, 1923వ సంవత్సర ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటించాను. దీని 8వ విభాగములో సూచించిన విషయాలు ఎవరెవరిని గురించి వ్రాశానో, ఏ అంశాలను మనస్సులోపెట్టుకొని వ్రాశానో ఇప్పుడు స్పష్టపరచలేను. ఆ నాటి పరిస్థితులను, వ్యక్తులను, తెలిసిన పాఠక మహాశయులు వాటిని గుర్తించగలుగుతారని నమ్ముతున్నాను.

---

# ఆంధ్ర తేజము, వందనం బందికొనుము

విజయనగ రాంజనేయు సేవింప నేఁగి
క్రూర విరచిత పరిభావ ఘూర్ణితాత్మఁ
బెల్లు వగఁ ద్రెళ్ళి, మది తల్లడిల్లి, యుల్ల
మందునం బాప సందేహ మల్లి కొనఁగ,
"నాంధ్ర తేజంబు గలదె యీ యవని నింక ?"
నంచుఁ గించిజ్ఞతన్ మించ నెంచినాఁడ;
కానిసందేహమును బూనినాను గాన
దోస మూనెను మది; కిదె దోసి లిడెద
నాంధ్ర తేజము, వందనం బంది కొనుము.

2

మౌర్యవంశ సంస్థాపనాచార్య వర్యుఁ
డైన చంద్ర గుప్తుండు, చండాంశు లీల,
యవన బలముల గవనున కవల నునిచి,
దండి తారాతి వీర ప్రకాండుఁ డగుచుఁ
బాలనము సేయ, మగధకుఁ బాటవమునఁ
గయ్యమునకు వియ్యమునకు నెయ్యమునకు
నీడు జోడనఁ గూడు నీ ప్రోడ యనఁగ
మన్ననలఁ గన్న వన్నెయే మాఱియున్న
తెలుఁగు నెఱుఁగక పొరపడి తెగఁ దలఁచితి,
దోస మూనెనుమది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజము, వందనం బంది కొనుము.

3

కైదు వడం బాపి మని యశోక కృతిశుం
డాత్మ పరితాప బోధ నీయానురాగ
పూరితం బగు సందేశముం బనుపంగ
విమల దర్పణ ప్రతిక్షిప్త బింబ మటుల
"ప్రణయ భరి తాత్ములమె మేము; బగఱ కొఱకె
"యాయుధాంకిత పాణుల నలరినార
"మిన్ని నాళులు; పశుబల మెన్ని తాత
"పడయని జయంబు శాంతినిం బడసి" తనుచు,
ఖడ్గ ధారలం బ్రేమ భంగములం జేసి,
భువి నశోకంపు మున్నీట ముంచి యెత్తు
నాంటి తేజంబు గలదను మాట లేమి,
దోస మూనెను మది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజమ, వందనం బంది కొనుమ,

4

అవల, నన్మూట యేండది హాయనంబు
లొక్క ఘక్కని దిక్కుల నుక్కు మిగిలి
యుర్వి సర్వంబు నేలు చక్రవ మతిని
"వేల లింకేల మా కలాలీలల" కని
మణి మయూ రాది దేదీప్య మానమైన
వస్తుష్ఠల తోడ విహరింప వసిధినెల్ల
యంచి తోద్యాన సరసిం గావించి మించి;
దుర్గ మాహార్యముల నెల్ల తొల్చి మల్చి
"స్వర్గ మిచోట భూమికి సాంగి వచ్చె

నేమొ" యనునట్లు సొంపుల నింపు నింపు
దేవళంబుల, శాశ్వత శీవి మెఱయఁ
గట్టి, గట్టిగ భక్తినిఁ జెట్టఁబట్టి;
గహ్వరంబుల కుడ్య భాగంబు లెల్ల
పటము లొనరించి, తా మెంత ప్రాఁత వడియు
నై గనిగ్యంబు పోని వర్ణముల తోడ,
బళిరె నేర్పున, రచియించి భారతీయ
చిత్రలేఖన కొక కొంత యాత్ర ముడిపి,
వజ్రమున కన్న పరుసనై వైరి పట్లఁ,
గష్ట మన్నను గుసుమంబుకన్న మెత్త
నగుచు, లోకంబు మెచ్చఁగా నలరినట్టి
తేజ మున్నది మఱి యొక్క యోజ ననుచు
నెంచఁ జాలక యే సంశయించినాఁడ;
దోస మూనెను మది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజమ, వందనం బంది కొనుమ.

5

వేఁగి దేశానఁ బాలన విధము నందు
నిగమ సభలను నిర్మించు నేర్పు మించు
సౌష్టవముఁ జూపి, దేశభాషా ప్రపంచ
సార్వభౌమత నర్థించి, సాహితీ వి
శుద్ధ వాహినీ గతి బుద్ధి నుద్ధతులయి,
నాఁటికిని నేఁటికినిఁ గూడ సాటియన్న
మాట లేకుండు రత్నాలమూట లనెడు
కృతుల నతులిత గతుల సన్నుతుల నందు

నా చళుక్యాది నృపుల కళ్యాణ కాల
మందుఁ గల తేజ మింకొక చందముంటఁ
గాంచనేరక మది సంశయించినాఁడ;
దోస మూనెను మది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజము, వందనం బంది కొనుము.

6

ఖండనా పరరుద్రులు, ఖండితారి
నికర భద్రులు, కీర్తి నిర్నిద్రు, లలఘు
వితరణ సముద్రు లగు రుద్ర క్షితివిభు లట
నోరుగల్లున విలసిల్ల, నుల్లసమున
మొఱకుఁ దురకల డీకొని నఱికియుండె,
రమ్య కావ్యంబులను బరిశ్రమల యందు
కాలమును బుచ్చి యుండె, విఖ్యాతిఁ గాంచి;
రుద్రమాంబిక సామ్రాజ్య భద్రపీఠి
నెక్కి, నొక్కట సర్వంబుఁ జక్కఁజేసి
'అబల యఁట! పాలనంబున సాబ గదేమి!
మేలు మే' లని పరులును జాలఁ బొగడ,
వైభవమ్మునఁ దులఁదూఁగి వన్నెఁగన్న
నాఁటి తేజంబు దాఁ బరిణామ మంది
యున్న దీ నాఁడుఁ, గనఁజాల కున్న కతన
దోస మూనెను మది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజము, వందనం బంది కొనుము.

7

సప్తవ ప్రాపృతంబు ప్రాసాదసీమ
దక్షిణా పథమెల్ల నుద్యానవనము
విజిత వైరిరాట్ శ్రీ) లశీవితతి గాఁగ
హాయి విహరించి, యాకాశ మంటుచుండు
స్వీయకేతన చేలాగ్ర సీమ పవన
చాలనంబునఁ దటతట సద్దు సేయు
నంత మాత్రాన శత్రు హృదంతరములు
దడదడని కొట్టుకొను నంత ధాటిఁ జూపి,
మణి గణపు పంక్తు లచటి విపణుల లోన
లోచనంబులు దనివారఁ జూచి చూచి,
నవ సుధా ధారలను మీఱు నవ్య భవ్య
కావ్య పీయూషపాన సౌఖ్యంబుఁ గాంచి,
యెందుఁ జూచినఁ దనవారె ముందు గాఁగ,
సర్వతోముఖ సుస్థిరైశ్వర్య మంది
విజయనగరాన ప్రతిభమై వెలయునాఁటి
తేజ మీ నాఁడుఁ గ్రాలుటఁ దెలియకుంట
దోస మూనెను మది, కిదె దోసి లిడెద
నాంధ్ర తేజము, వందనం బంది కొనుమ.

8

అన్ని దిశలను మన్నన లంది యవని
నల్లుచున్న నీ భుజ బలంబైనఁ గాని,
జలధి వలయిత మేదినీ చక్ర మందు,
నిదియు నదియును ననకుండ, నెల్ల యెడల

కరిగి మాన్యత మనెడి సాహసము గాని,
అద్వితీయ పరాక్రమ మరులు మెచ్చ
నాహవక్షోణిఁ బోరు ధైర్యంబు గాని,
శితనగ మంటి దీప్తి రాజిల్లుచున్న
ప్రాభవస్ఫూర్తిలో నొక్క పాలు గాని,
కడలి మొదలుగ నల చలిగట్టు వఱకుఁ
గలుగు నాడులఁ బోడిమిఁ గాంచుచున్న
భవ్య భవదీయ పాలన ప్రౌఢిఁ గాని,
న్యాయ శాలల నున్న యగ్రాసనములఁ
గొలువు నెలకొని శోభలఁ గులుకుచున్న
యనుల విజ్ఞాన వైభవ మైనఁ గాని,
కార్య సాఫల్యమునకు గంకణము గట్టి
యెట్టి యిక్కట్టు లలమిన నీసడించి
ముందె నడచెడి నీదగు పూన్కిఁ గాని,
'ఆత్మశిక్షణఁ జేకూఱు నలఘు భాగ్య'
మనెడి నానుడి తత్త్వంబు నరసి చూపు
నబ్బురంబగు త్యాగంబునైనఁ గాని.
దేని నైనను నొక్కింత యైనఁ గాని
యరసి సంతస నద్దిరా యాంధ్ర తేజ
మంతరింపఁగ లేదు, రూపాంతరముల
నలరుచున్నది నేఁడును నసఁగఁ దగదె!
అట్లు చూడంగ లేక నేనక్కటకట!
కాని సందేహమును బూనినాను గాన

దోస మూానెను మది, కిదె దోసిలి డెద
నాంధ్ర తేజమ, వందనం బంది కొనుమ.

9

ఆంధ్ర తేజంబు గల; దింక నలరఁ గలదు;
చూడఁ జాలక బేలనై గోలు మంటి;
శోకపుం బొరక ప్పె నాలోకనముల,
సందియం బంధకారమై క్రందు కొనియె,
బాగు నోగు నెఱుంగని పాడువంత
వింత చింతలఁ బైకొని యింత చేసె;
అతుయ, మనశ్వరము; సిద్ధ, మతురంబు
నైన నిను గూర్చి సందేహ మందినాఁడ,
దోస మూానెను మది, కిదె దోసిలి డెద
నాంధ్ర తేజమ, వందనం బంది కొనుమ.

---

